3.12.1993 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 64, సంచిక: 49, విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు



రాయలసీమలో కల్తీ సారా చావు రోదనలు సద్దుమణిగినా, కాంగ్రెస్ నాయకుల

# తిట్లు, బూతులతో మార్మోగుతూంది!

కడప జిల్లా మైదుకూరులో కల్తీ లిక్కర్ తాగి సుమారు 30 మంది మరణించిన సంఘటన రాజకీయ మలుపు తిరిగి

**దివాకర్ రాజశేఖర్ రణహుంకారాలు రాయలసీమను భయభ్రాంతం చేస్తున్నాయి- పార్టీని పతనం చేస్తున్నాయి!**

ముఖ్యమంత్రిని ఇబ్బందుల్లో పడేసింది. రాష్ట్రమంత్రులు జె.సి. దివాకర రెడ్డి, డాక్టర్ డి.ఎల్. రవీంద్ర రెడ్డి ఈ దుర్ఘటనకు బాధ్యులని ఉభయ వర్గాలు ఒకరి పై ఒకరు దుమ్మెత్తి పోసుకోవటంతో రాయలసీమలో ఉద్రిక్త పరిస్థితి నెలకొన్నది. కడప లోకసభ సభ్యుడు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ఆయన వర్గీయులు డాక్టర్ డి.ఎల్. రవీంద్ర రెడ్డికి మద్దతుగా రంగంలో దిగి జె.సి. దివాకర రెడ్డిని, ఆయన వర్గీయుల్ని దుయ్యబడ్తున్నారు. దివాకర్ రెడ్డి వర్గం కూడా ప్రత్యర్థి వర్గానికి తీసిపోకుండా ప్రత్యారోపణలు చేస్తున్నారు. కడప జిల్లాకు చెందిన మరో మంత్రి డాక్టర్ ఎమ్.వి. మైసూరా రెడ్డి తన రాజకీయ ప్రత్యర్థి వై.ఎస్.కు వ్యతిరేకంగా దివాకర్ రెడ్డికి మద్దతు ఇస్తుండటంతో రాయలసీమ రెండుగా చీలిపోయి ఏ క్షణంలో ఏమవుతుందో నన్న భయం పట్టుకుంది. ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి కూడా రాయల సీమకు చెందిన వాడు కావటమే గాక కాంగ్రెస్ పార్టీ క్రమశిక్షణా సంఘం ఛైర్మెన్ కావడంతో ఆయన పరిస్థితి మింగుడు పడటం లేదు. ముఖ్యంగా 30 మంది మరణానికి దారితీసిన సంఘటనలో తన మంత్రి వర్గ సహచరుల పాత్ర వుందని పరస్పరం ఆరోపించు కోవడం ముఖ్యమంత్రికి తలనొప్పిగా తయారైంది. రాష్ట్రంలో మరో ఏడాదిలో ఎన్నికలు రానున్న తరుణంలో కాంగ్రెస్ పార్టీలో కుమ్ములాట రాయలసీమ నుంచి మొదలు కావటంతో ముఖ్యమంత్రి దిక్కు తోచని పరిస్థితిలో పడ్డారు. డాక్టర్ రాజశేఖర రెడ్డి పని గట్టుకొని సారా మరణాల్ని రాజకీయం చేశాడని ముఖ్యమంత్రి వర్గీయులు అభిప్రాయ పడ్తున్నారు. దివాకర్ రెడ్డి పై కోపాన్ని వై.ఎస్. రాజకీయ లబ్ధి కోసం వాడుకుంటున్నాడని, దానితో దివాకర్ రెడ్డి కూడా గత్యంతరం లేని పరిస్థితుల్లో ఎదురు తిరిగి మోదుతున్నాడని వారంటున్నారు. అయితే ఉభయ వర్గాలూ నువ్వు దొంగ అంటే నువ్వు దొంగ అంటూ

**సర్దుబాటు ముఖ్యమంత్రి వల్ల కాలేదు; ప్రధాని జోక్యం చేసుకోలేదు; పిసిసి నోటీసులు ఎవరూ ఖాతరు చేయడం లేదు!**

చేసుకుంటున్న ఆరోపణల్లో నిజానిజాలెట్లా వున్నా దీని వల్ల కాంగ్రెస్ పార్టీ పరువు బజారున పడిందని ముఖ్యమంత్రి వర్గీయులు నెత్తి నోరు బాదుకుంటున్నారు. దివాకర్ రెడ్డి దొంగ సారా తయారు చేయించి అనంతపూర్, కడప జిల్లాలలో విక్రయిస్తున్నాడని, పర్మిట్లు లేకుండా బస్సులు నడిపి మోసం చేస్తున్నాడని వై.ఎస్. రెడ్డి వర్గీయుల ఆ...

కొ... పేజీలో

# జమున పాకాన పడిన పిసిసి పిచ్చి!

రాష్ట్రంలో కాంగ్రెస్ పెద్దల ప్రవర్తన నానాటికి తీసి కట్టుగా తయారైంది. పిసిసి అధ్యక్షుడు మర్రి తులసీదాస్‌కు, రాష్ట్ర మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి జమునకు మధ్య నిప్పు - ఉప్పులా వుంది. పిసిసి అధ్యక్షుడు మహిళా కాంగ్రెస్ పట్ల వివక్షత చూపుతున్నారని, గాంధీ భవన్‌లో తమకు కూర్చోవడానికి కుర్చీలు కూడా ఇవ్వటం లేదని శ్రీమతి జమున ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేశారు. అంతే కాకుండా గత కాంగ్రెస్ ముఖ్యమంత్రులు మర్రి చెన్నారెడ్డి, ఎన్. జనార్దన రెడ్డి హయాంలలో కాంగ్రెస్ పార్టీ బాగా దెబ్బ తిన్నదని, ఆ ముఖ్యమంత్రులు చేపట్టిన ప్రజా వ్యతిరేక కార్యక్రమాల వల్ల పార్టీ బాగా నష్ట పోయిందని జమున పత్రికా ప్రకటన చేసి

**ముసలి తులసీదాస్‌పైకి కొంగు బిగించి కాలు దువ్వుతున్న మహిళా కాంగ్రెస్**

వివాదంలోల్లో తల దూర్చారు. దీనితో పిసిసి అధ్యక్షుడు మండి పడి ఆమెకు షోకాజ్ నోటీస్ జారీ చేశారు. కాంగ్రెస్ ముఖ్యమంత్రుల్ని విమర్శించడం పార్టీ క్రమశిక్షణను ఉల్లంఘించడమే అవుతుందని ఆయన అంటున్నారు. అయితే మహిళా కాంగ్రెస్ పిసిసికు సబార్డినేట్ కాదని, తమ పై చర్య తీసుకునే అధికారం పిసిసికు లేదని ఆమె అంటున్నారు. ఈ వ్యవహారంతో కాస్తా ముఖ్యమంత్రి దగ్గరకు వెళ్లింది. ఆయన పంచాయితీ పెట్టి ఇద్దరినీ మందలించినట్లు వార్త. అయితే వారిద్దరూ ఒకరి పై మరొకరు ఢిల్లీ అధిష్టానానికి ఫిర్యాదు చేసుకోవటంతో పిసిసి ముదిరి మహిళా కాంగ్రెస్ పాకాన బడింది.

*

# కోట్ల ఇంటికే బీటలు పెట్టాడు ఎన్టీఆర్!

ప్రాంతీయ సదస్సుల్లో భాగంగా తెలుగుదేశం పార్టీ కర్నూలులో నిర్వహించిన మూడో సదస్సు ఊహించిన దానికంటే సూపర్ హిట్ కావటంతో ముఖ్యమంత్రి శ్రీ

**కర్నూలు సదస్సుకు అంచనాకు మించి జనం**

కోట్ల విజయభాస్కర రెడ్డి సొంత జిల్లాలో సైతం గండి పడి... కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా తెలుగుదేశం పార్టీ రాజమండ్రి (ఆంధ్ర), నల్గొండ (తెలంగాణా), కర్నూలు (రాయల సీమ) లో ఏర్పాటు చేసిన సదస్సులకు అంచనాలకు మించి జనం తరలి వచ్చారు. రాజమండ్రి, నల్గొండ సదస్సుల కంటే కర్నూలు సదస్సుకు జనం ఎ... సంఖ్యలో హాజరు కావడంతో ముఖ్యమంత్రి ఆస్థానంలో కలవరం మొదలైంది. ఇటీవలనే కాంగ్రెస్ పార్టీ నుంచి బయటకు వచ్చిన కర్నూలు జిల్లా ప్రజా పరిషత్ మాజీ అధ్యక్షుడు మసాల ఈరన్న, ముఖ్యమంత్రి విజయ భాస్కర రెడ్డి మేనల్లుడు, పిసిసి ప్రధాన కార్యదర్శి అయిన కొత్త కోట ప్రకాష్ రెడ్డిని తెలుగుదేశంలో చేర్చుకుంటున్నట్లు కర్నూలు సదస్సులో ఎన్టీఆర్ ప్రకటించారు. దీంతో ముఖ్యమంత్రి ఇంట్లో కూడా ముసలం పుట్టినట్లయింది. కర్నూలు జిల్లాకు చెందిన మాజీ మంత్రి కె.ఇ.

**లోక్‌సభ సీటుకు ముస్లింలకై ఒత్తిడి**

కృష్ణమూర్తి కూడా కోట్ల పై కారాలు మిరియాలు నూరుతున్నారు. కె.ఇ. సోదరులు ఇప్పటికే పసుపు పంచన చేరిపోయారు. కె.ఇ. కృష్ణమూర్తిని కూడా తెలుగుదేశంలోకి లాగేందుకు చంద్ర బాబు నాయుడు తీవ్రంగా కృషి చేస్తున్నట్లు వినికిడి. సొంత జిల్లాలో రాజకీయ ఆటుపోట్ల మధ్య ముఖ్యమంత్రి నలిగి పోతున్నారు. త్వరలో జరుగనున్న కర్నూలు లోకసభ ఎన్నికల్లో కుమారుడు ప్రకాష్ రెడ్డిని నిలబెట్టి గెలిపించు కోవాలని ముఖ్యమంత్రి భావిస్తుండగా జిల్లాలో వస్తున్న మార్పులు ముఖ్యమంత్రిని కుంగదీస్తున్నాయి. కర్నూలు సీటును ముస్లిం అభ్యర్థికి కేటాయించాలని ఇప్పటికే జిల్లాలో ప్రచారం మొదలైంది. కె.ఇ. కృష్ణమూర్తి కూడా దీనికి మద్దతు తెలిపారు. బాబ్రీ మసీదు సంఘటన వల్ల కాంగ్రెస్ పట్ల వ్యతిరేకంగా వున్న ముస్లింలను దగ్గరకు తీసుకోవాలంటే కర్నూలు లోకసభ టిక్కెట్టును ముస్లిం అభ్యర్థికి కేటాయించాలని కె.ఇ. ప్రభృతులు వాదిస్తున్నారు. కొడుకును తన రాజకీయ వారసుడిగా చేయాలన్న ముఖ్యమంత్రి 'చిరు' కోరికను ఈ ప్రచారం విఘాతం కలిగిస్తోంది.

**వారసత్వం చిరు కోరిక నెరవేరదా?**

కర్నూలు నియోజక వర్గంలో ముస్లింల సంఖ్య గణనీయంగా వుండటం ఇక్కడ గమనార్హం.

కర్నూలు జిల్లాలో ముఖ్య మంత్రి కుమారుడు ప్రకాష్ రెడ్డి వ్యతిరేక బాట బాగా బలం పుంజు...

కొరవ 11 పేజీలో





యువకుడు, ఉత్సాహవంతుడు,
మా గున్నంరెడ్డి హరిరెడ్డిని
అన్న N.T.R. గారి ఆశీస్సులతో జిల్లా
తెలుగు యువత కార్యదర్శిగా రాష్ట్ర తెలుగు
యువత అధ్యక్షుడు
డాక్టర్ దగ్గుపాటి వెంకటేశ్వర రావు
నియమించిన శుభ సందర్భమున
ఇందుకు సహకరించిన

| దేగా నారశింహారెడ్డి<br>మాజీ జిల్లా పరిషత్ అధ్యక్షుడు | తాళ్ళపాక రమేష్ రెడ్డి<br>మాజీ నెల్లూరు మున్సిపల్ ఛైర్మెన్ | నల్లపురెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి<br>కోవూరు ఎం.ఎల్.ఏ., |
|---|---|---|

గార్లకు కృతజ్ఞతలు తెలియజేస్తూ

# సంగం మండలం తెలుగుదేశం కార్యకర్తలు.



| | | | | |
|---|---|---|---|---|
| డా. జి. కొండారెడ్డి<br>డెంటల్ సర్జన్ | పెళ్లకూరు పెంచల రెడ్డి<br>మక్తాపురం | గడ్డం శంకర రెడ్డి<br>దువ్వూరు | నావూరు గోపాల్ రెడ్డి<br>మర్రిపాడు | సూరా ప్రభాకర రెడ్డి<br>సిద్దీపురం |
| కలవకూరు కృష్ణారెడ్డి<br>దువ్వూరు | జి. చంద్రశేఖరయ్య<br>జంగాల కండ్రిగ | తుమ్మల పెంచల రెడ్డి<br>సంగం | పెన్నా గౌరీశంకర రెడ్డి<br>సంగం | చెన్నూరు బాబూల్ రెడ్డి<br>మక్తాపురం |
| అల్లూరు వెంకట రమణారెడ్డి<br>మక్తాపురం | కూరపాటి ప్రసాద నాయుడు<br>మక్తాపురం | కాకు వెంకటేశ్వర యాదవ్<br>సంగం | ఎస్. దశరథరామయ్య<br>సంగం | ఆనం వెంకట శేషారెడ్డి<br>వెంగారెడ్డి పాళెం |
| చిన్నిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి<br>సిద్దీపురం | రేబూరు వెంకురెడ్డి<br>వంగల్లు | పులగం శేషారెడ్డి<br>అన్నారెడ్డిపాళెం | ఎస్‌కె జలీల్ బాషా<br>దువ్వూరు | ఎస్‌కె బాషా మొహిద్దీన్<br>దువ్వూరు |
| కాకి రంగా రావు<br>దువ్వూరు | వేల్పుల పెంచలయ్య<br>దువ్వూరు | కూనపల్లి యానాదయ్య<br>దువ్వూరు | కల్చేటి వేణుగోపాల్ రెడ్డి<br>అన్నారెడ్డి పాళెం | పెళ్లూరు రామకృష్ణారెడ్డి<br>అనసూయనగర్ |
| తుమ్మల రామకృష్ణారెడ్డి<br>సంగం | గువ్వల వేణుగోపాల్ రెడ్డి<br>దువ్వూరు | కూరపాటి శేషారెడ్డి<br>దువ్వూరు | పందిళ్లపల్లి శివకుమార్ రెడ్డి<br>పెరమన | కల్చేటి కామేశ్వర రెడ్డి<br>కోలగట్ల |
| కావలి ప్రకాశ రావు<br>సంగం | మేరా రఘురామిరెడ్డి<br>కోలగట్ల | ఉయ్యాల కిష్టయ్య<br>సంగం | బి. భాస్కర రెడ్డి<br>వెంకటేశ్వర పాళెం | జి. విజయనారాయణ రెడ్డి<br>చెన్నవరప్పాడు |
| ఉక్కాల భూమయ్య<br>ఉడ్‌హౌస్‌పేట | ఉక్కాల వెంకటాద్రి<br>ఉడ్‌హౌస్‌పేట | తుమ్మల వెంకట సుబ్బారెడ్డి<br>సిద్దీపురం | తుమ్మల సుందర రామరెడ్డి<br>పడమటిపాళెం | పి. రేణుకా రెడ్డి<br>పెరమన |
| కంటాబత్తిన ప్రభాకర రెడ్డి<br>సంగం | పెనుబాక చెంచుక్రిష్ణారెడ్డి<br>సంగం | | ఎస్. వెంకట శేషారెడ్డి<br>కొరిమెర్ల | గున్నంరెడ్డి పెంచల రెడ్డి<br>సంగం |



# జమీన్‌రైతు

## ఓటర్లకు జోహార్లు

ఉత్తరాది రాష్ట్రాల ఎన్నికలలో బిజెపి దిమ్మ తిరిగింది. వారి పరిపాలన సాగిన నాలుగు రాష్ట్రాలలోనూ ప్రజలా పార్టీని తిరస్కరించారు. బాబ్రీ మసీదు కూల్చి వేతతో తామొక రాజకీయ మహా ప్రభంజనం సృష్టించామని విర్ర వీగుతుండిన బిజెపి నేతల ఆశలు వమ్ము చేస్తూ, కలలు కల్లలు చేస్తూ ఓటర్లు నిర్ణయం తీసుకున్నారు. భారతీయ ఓటరు ఎంత రాజకీయ పరిణతి, విజ్ఞత కల్గిన వాడో 1972, 1977, 1980 ఎన్నికలు నిరూపించాయి. ఇప్పుడా రెండూ మరొక సారి లోకానికి వెల్లడైనాయి.

అయోధ్య దురంతానికి ముందు రాజస్థాన్, హిమాచల్ ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో బిజెపి ప్రభుత్వా లుండినాయి. ఇప్పుడు ఆ నాలుగు రాష్ట్రాలలో వారికా అవకాశం లభించలేదు. రాజస్థాన్, ఉత్తర్ ప్రదేశ్‌లలో అతి పెద్ద పార్టీగా అవతరించి గుడ్డిలో మెల్లగా పరువు నిల బెట్టుకున్నారు. మధ్య ప్రదేశ్, హిమాచల్ ప్రదేశ్‌లలో ఆ పరువూ దక్కలేదు. హిమాచల్ ప్రదేశ్ ఓటమి మరీ అవమాన కరమైనది. ఈ ఎన్నికల ద్వారా ప్రజలు బిజెపి పరిపాలననే కాదు- వారి హిందూ మతమౌఢ్యాన్ని కూడా తిరస్కరించారు. హిందూ ధర్మ పరిరక్షకులుగా తమను తాము ప్రకటించుకొని, మెజారిటీ మత ప్రాతిపదికగా రాజకీయాలు నడవాలని ప్రచారం చేసి హిందువుల అభిమానం చూరగొనాలని ప్రయత్నించింది బిజెపి. కాని తెలివైన ఓటర్లు వారికా అవకాశం కల్పించలేదు. రాజకీయాలకు మతానికి ముడిపెట్టడం తమకు సమ్మతం కాదని, దేముడి పేరుతో ఓట్లడుక్కునే కక్కుర్తిని తాము సహించమని స్పష్టంగా తేల్చి చెప్పారు. ఈ నాలుగు రాష్ట్రాలలో బిజెపి గెల్చి వుంటే లౌకికత్వానికి తరతరాలుగా మన్నన పొందిన భారత జాతి మత ఛాంధసురాలిగా నింద మోసి వుండేది. మత పరమైన మెజారిటీతో పాలనాధికార నిర్ణయం జరగడం ప్రమాద కరమని, సముచితం కాదని ఓటర్లు తేల్చి చెప్పారు; తీర్పు నిచ్చారు.

బిజెపి ఓటమితో దేశానికి మరొక ప్రమాదమూ తప్పింది - అది మధ్యంతర ఎన్నికల అవసరం. ఈ నాలుగు రాష్ట్రాలలో గెల్చి వుంటే బిజెపి నాయకులు ప్రక్కరోజు నుంచే పివి నరసింహా రావును రాజీనామా చేయమని బలవంత పెట్టి వుండేవారు. మైనారిటీలో వున్నప్పటికీ నిలకడగా, నింపాదిగా ఆర్థిక సంస్కరణలు అమలు చేస్తున్నది కాంగ్రెస్ ప్రభుత్వం. ఈ దశలో కేంద్రం అస్థిరత్వానికి లోనైతే, సంస్కరణల దిశ మారితే భారతదేశ భవితవ్యమే సందేహంలో పడి వుండేది అటు వంటి ప్రమాదాన్ని నేర్పుగా తప్పించారు ఓటర్లు.

అయితే కాంగ్రెస్‌కూ సంతోష దాయకమైన వేమీ కాదు ఈ ఎన్నికలు. ఢిల్లీ, ఉత్తరప్రదేశ్‌లో ఎదురైన ఘోర పరాజయం కాంగ్రెస్ భవిష్యత్‌ను ప్రశ్నార్థకంలో పెడుతున్నది. ఒకటి దేశ రాజధాని అయితే, మరొకటి 85 పార్లమెంట్ స్థానాలున్న అతిపెద్ద రాష్ట్రం. అటువంటి రాష్ట్రంలో కాంగ్రెస్‌కు నాలుగవ స్థానం లభించింది. ఇటు హిందువులు, అటు ముస్లింలు; ఇటు అగ్ర వర్ణాల వారు, అటు హరిజనాది బలహీన వర్గాల వారు కాంగ్రెస్ పట్ల తమకు విశ్వాసం లేదని తేల్చి చెప్పారు. వందేళ్ల చరిత్ర కల్గిన ఒక రాజకీయ పార్టీ సమాజంలోని ఏ ఒక్క వర్గం నమ్మకాన్నీ చూరగొన లేని దయనీయ స్థితిలో వుండడం కంటే విచారకరమైన విషయం వేరొకటి వుండదు. ఇందిరా, రాజీవ్‌ల శకం అంతరించిన తర్వాత కాంగ్రెస్ పార్టీ ప్రజల వద్దకు వెళ్లడానికి ఒక్క నినాదాన్నీ, కార్యక్రమాన్నీ రూపొందించు కోలేక పోతున్నది. ఫలాని విజయం మేము సాధించామని చెప్పుకోలేక పోతున్నది. ఆర్థిక సంస్కరణలు దేశానికి మేలు చేసేవే అయినప్పటికీ, వాటి ఫలితాలు ఇంకా ప్రజలకు చేరువ కాలేదు. అవి సత్ఫలితాల నిస్తాయో, దుష్ఫలితాల నిస్తాయో కూడా ఇంకా తేలలేదు. అందువల్లే వాటి ఆకర్షణతో ప్రజలను మెప్పించడం కాంగ్రెస్ వల్ల కావడం లేదు. ఇంకొక ప్రక్క పార్టీలో ఛరిష్మా కల్గిన నాయకుడు ఎవరూ లేకుండా పోయారు. వచ్చే సాధారణ ఎన్నికల లోగానైనా కాంగ్రెస్ పెద్దలు ఆత్మ పరిశీలన చేసుకొని నిర్దుష్టమైన కార్యక్రమాలు, నిరూపణ అయిన విజయాలతో ప్రజల ముందుకు వచ్చే పరిస్థితి కల్పించు కోవడం అవసరం.

ఉత్తరప్రదేశ్‌లో సమాజవాది బహుజన సమాజ్ పార్టీల జనతా కూటమి విజయం - సామాజికంగా వెనుక బడిన వర్గాల ప్రజల సమష్టి నిర్ణయం ఫలితం. ఒక నూతన సామాజిక పరిణామ క్రమానికి నాంది పలికిందక్కడ. అది దేశ వ్యాప్తమౌతుందో, అక్కడికే పరిమితమౌ తుందో ఇప్పుడే చెప్పలేము. కాని కులపరంగా రాజకీయ వ్యవస్థ చీలిపోవడం అంత శ్రేయస్కర పరిణామం కాదేమోనన్నది పరిశీలకుల అభిప్రాయం.

ఈ ఎన్నికలలో గుర్తింపుకు రాని మరొక పోకడ - కమ్యూనిస్టుల సహజ మరణం. కమ్యూనిస్టులను ప్రజలు పూర్తిగా విస్మరించారు. రాజకీయ స్రవంతి నుంచి వారిని ప్రక్కకు తప్పించారు. జనతాదళ్ కూడా రంగం నుంచి నిష్క్రమించింది.

# జమీన్‌రైతు

3.12.1943

పేజీలు 4, వెల 0-1-6

## నెల్లూరు ముచ్చట్లు

### టవున్‌లో

టవును హెల్తు యిన్‌స్పెక్టరు కృష్ణరావును గూర్చి ఎన్నో కంప్లెంట్లు వస్తుంటవి. అన్నిటి కంటె ప్రక్కయింటి వాడు రామానుజాలు శెట్టిగారి గోడు పెద్దది. ఒక అధికారిని చాలా సంవత్సరాలు ఒకే చోట వుంచితే యీలాంటి కంప్లెంట్లు రాక తప్పవు. ఏది ఎట్లున్నా ప్రక్కయింటివాండ్లతో దీర్ఘవిరోధం పనికిరాదు. ఇరువురు మమేకంగా పొమ్మని మా సలహా. కంప్లెంట్ల యధార్థం మేము విచారించి తర్వాత విమర్శిస్తాం.

పత్తివారి కృష్ణా అండుకో వారివద్ద కోర్టు శిరస్తారు ఎలెక్ట్రిక్ బల్బులు కొంటె రెంటికి మాత్రం రశీదులిచ్చి 10 బల్బులకు రశీదు లివ్వలేదని పోలీసు రిపోర్టు, విచారణ, మేము యివ్వలేదు. శిరస్తారు పెరుక్కుని డబ్బు విసిరి పారవేశాడని శెట్టి అండ్‌కో వారి వాదం. పాఠకులు ఏది నమ్ముతారో? కేసు మాత్రం పోలీసు విచారణలో వుంది.

ఎ.సి. రెడ్డి పార్కు ఎదుటవుండే ఎలెక్ట్రిక్ ఘడియారానికి జబ్బుచేసింది. దిక్కు దివాణంలేక ఏడుస్తూ నిల్చొనున్నది. కమీషరు నడిగితే మురికి నీళ్ళు, అంటువ్యాధులకు ఆకరమైన మీ నెల్లూరు మొహాలకు ఘడియార మొకటి తక్కువా, అంటాడేమో? అదీ గూడా నిజమే. ఆ వెన్నెలకంటి రాఘవయ్య దొడ్డి తట్టువెళ్లి చూడండి. ఆ ప్రాంతమంతా కువ్వంనది యొక్క మాతృదేవత మాదిరి కనిపిస్తుంది. ఓ హెల్తుశాఖ! అలాంటి మురికి సముద్రాల కడుపులో బెట్టి అంటువ్యాధులను పారద్రోలాలంటె నీకు సాధ్యమా? తక్షణం ఆ మురికి నీళ్ల సముద్రాన్ని పారద్రోలవయ్యా!

మన్నాధరావు నాయుడు గారి ధర్మాన కట్టెపుల్లల బాధేమో కొంత తగ్గింది. కాని కిర్సనాయిల్ బాధ మహా పెరిగింది. నెలరోజులకు కూడ ఒకసీసా దొరకడం లేదు. ఇక స్కూల్ పిల్లలకు పరీక్ష రోజులు. కిర్సనాయిల్ యెక్కువ కావాలి. నాయుడుగారి ఒక కన్ను కిర్సనాయిల్ డబ్బాలమీదకు ప్రసరింప జేయమని ప్రార్థన.

### అధికారులు

జిల్లా కలెక్టరు "డే" దొరగారిని మద్రాసుకు మార్చారు. వారికి బదులు యీ మధ్య ఆక్టింగు




చేసి పోయిన పీనాయి గార్ని వేశారు. వారు మరొక నెల శలవు పొడిగించు కొన్నారట. ఆ కారణంగా, డే దొరగారు ఎప్పుడు పోతారో తెలియదు. బహుశా 8 తేది నాటికి తెలియ వచ్చునని వూహ.

డే దొర గారి పాలన హిందూ మహమ్మదీయ గలటా ల్లోనేమి, గత రాజకీయ కల్లోల తరంగాల్లోనేమి, ఇతర విషయా ల్లోనేమి, ఒడుదుడుకులు లేకుండా, ఏ పార్టీ ఉచ్చులలో బడకుండా, చెప్పుడు మాటలకు చెవి యొగ్గకుండా ఒక మొస్తరుగా సమర్థతతో నడిచిందనే చెప్పాలె. వారికి మా ధన్యవాదాలు.

బర్డి జార్డిన్ గారు 6 తేది మొదలు ఒక నెల శెలవు. బదులు కె.యస్. వెంకట్రామన్, ఐ.సి.ఎస్ గా వస్తారు.

* * *

### అవీ-ఇవీ

కుమారునికి జబ్బుగా వున్నందున మన్నేపల్లి హనుమంతరావు గారు 20 రోజులు పెరోల్‌మీద 30 తేది మధ్యాహ్నం వచ్చిరి.

ముత్తరాజు గోపాలరావు గారికి కొంత నిమ్మళంగా వుందట.

బొమ్మాశేషురెడ్డి గారు తల్లి ఖర్మకు పెరోల్ మీద వచ్చారు.

ఏట్లో మునిగిపోయిన దొడ్ల వారి కారు సజీవంతో 29 తేది బ్రతికి బైటబడ్డది. ఇక మందుఖర్చుకు వెయ్యి రూపాయలు శలవు జేస్తేనే గాని కారు మెదిపెట్టులేదు.

పాటూరు సుబ్బరామయ్య కేసు 1 తేది కొంత నడిచింది తిరుగా 7 తేదికి వాయిదా.

-విమర్శకుడు

### మధ్యపాన నిషేధసభ

నెల్లూరు జాతీయ విద్యార్థి, యువజన సంఘాల యాజమాన్యమున మధ్యపాన నిషేధసభ, నిన్న సాయంత్రం తిప్పరాజు సత్రం వద్ద, శ్రీ గండవరపు హనుమారెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. సభలో శ్రీ కె.ఎల్. సింహా రాధాకృష్ణయ్య గారలు మాట్లాడిన పిమ్మట, మధ్యపాన పునరుద్ధరణను సెల్బుటాక్సు పెంపకమును ఖండించుచూ తీర్మానాలు చేశారు.

(మా.వి)

కొరవ 8 పేజీలో

# ప్రజా సంక్షేమం కంటే ఇంజనీర్ల స్వలాభం ముఖ్యం!

ప్రపంచ బ్యాంకు నిధులు ఖర్చు చేయను ఫిబ్రవరి నెల చివరి వరకు టైము వుండగా కొంపలు మునిగి పోయినట్లు జిల్లావ్యాప్తంగా రోడ్డు పనులు చేస్తున్నారు. ప్రజా సంక్షేమం కోసం ఇంత త్వరగా చేస్తున్నారని అనుకుంటె పప్పులో కాలేసినట్లే. ఈ తూక్ మాలిష్ పనులు ఇంజనీర్లు, కాంట్రాక్టర్లు తమ స్వలాభం కోసం చేసుకొంటున్నారు. ఆత్మకూరు బస్టాండు వద్ద రైల్వే బ్రిడ్జిని ఒక పక్క త్రవ్వి పారేశారు. వన్‌వేలో వాహనా లన్నింటితో పాటు పాదచారులు కూడా పడరాని పాట్లు పడుతున్నారు. నాలుగు చినుకులు రాలితే ఆ దుస్థితిని వర్ణించలేము. ఇప్పటి వరకు ప్రపంచ బ్యాంకు నిధులు ఖర్చు చేసి వేసిన రోడ్లు, త్రవ్విన డ్రైనేజిలు, కట్టిన కల్వర్ట్లు పని తీరు చూస్తె మన ఇంజనీర్లను ఏమనాలో అర్థం కావడం లేదు. ఆత్మకూరు బస్టాండ్ అండర్ బ్రిడ్జి రిపేర్లు ఈ సారైనా పక్కా ప్లానింగ్‌తో చేయాలి. లేకుంటె లక్షలాది రూపాయలు మళ్లీ డ్రైనేజిలో వేసిన వారమవుతామని ఇంజనీర్లు కాంట్రాక్టర్లు గ్రహించాలి.

నెల్లూరు -ఎ. మారుతి ప్రసాద్

## జనవాణి

### టర్నోవర్ ట్యాక్స్ తీరు

కేంద్ర ప్రభుత్వం సేల్స్ ట్యాక్స్ వసూలును సరళీకృతం చేసి సింగిల్ పాయింటు వద్ద ట్యాక్సు వసూలు చేస్తున్నారు. కాని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అదనంగా టర్నోవర్ టాక్స్ విధిస్తూ ఆర్డినెన్సు జారీ చేసింది. దీని ప్రకారం ఒక కోటి టర్నోవర్ గల వారు ఒక పర్సెంట్ అంతకు మించిన వారు రెండు పర్సెంట్ చెల్లించాలి. ఏ వస్తువైనా ఉత్పత్తి దారుడు, సూపర్ స్టాకిస్టు, స్టాకిస్టు, హోల్‌సేల్ వ్యాపారస్తులు మరియు రీటైల్ వ్యాపారస్తుల నుండి వినియోగదారునికి చేరుతుంది. ఇందరి

కొరవ 10 పేజీలో

# "మీరే పెద్ద దొంగలు! మీరేంది దొంగల్ని పట్టేది!"

## నెల్లూరు

## విజిలెన్స్ పోలీస్ స్టేషన్ ప్రారంభోత్సవంలో చమత్కారాలు!

## సంగతులు

పెరా విపేధం వల్ల ఖజానాకు పడిన గండిని పూడ్చు కోవడానికి వ్యాపారుల ముక్కు పిండబోతున్నది ప్రభుత్వం; పన్నులు ఎగ్గొట్టే వారి భరతం పట్టేందుకు పూర్తిగా విజిలెన్స్ ఎన్‌ఫోర్స్‌మెంట్ స్టేషన్లను ప్రభుత్వం కొత్తగా ఏర్పాటు చేసింది. వీటికి సాధారణ పోలీసు స్టేషన్ల వలె అరెస్ట్ చేసే అధికారా లుంటాయి; నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు జిల్లాల పరిధిలో పనిచేసే నెల్లూరు స్టేషన్‌ను రాజరాజేశ్వరి దేవాలయం వెనుక పోస్టల్ కాలనీలో 1 తేది గుంటూరు రేంజి డి.ఐ.జి. శ్రీ ఎస్.కె. జయచంద్ర వేదమంత్రోచ్ఛారణ మధ్య ప్రారంభించారు. పన్నుల రూపంలో కాసుల వర్షం కురవాలని కాబోలు లక్ష్మీదేవి పటానికి పూజ, తదనంతరం సభ నిర్వహించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన సర్వేపల్లి శాసన సభ్యుడు, ప్రభుత్వ విప్ శ్రీ సి.వి. శేషారెడ్డి మాట్లాడుతూ ఐ.డబ్ల్యుడి, ఆర్ అండ్ బి శాఖల పై విరుచుక పడ్డారు; తుఫాను వంటి అత్యవసర పరిస్థితులను తట్టుకొను ప్రపంచ బ్యాంకు నిధులతో వేసిన రోడ్లు, డ్రైనేజి పనుల పటుత్వం మొన్నటి భారీ వర్షాలకే కనపడింది. వానలకే కొట్టుక పోయే రోడ్లు తుఫాన్లు కెట్లా వుపయోగ పడతాయి? ఈ విషయాలను ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖ పరిశీలించి దోషులపై కఠిన చర్య తీసుకోవాలని కోరారు. సి.వి. వ్యాపారస్తులను ఇబ్బంది పెట్టేందుకు ప్రత్యేక శాఖ ఏర్పాటు చేసినట్లు భావించ వద్దని చెప్పారు. అధ్యక్షత వహించిన నెల్లూరు శాసన సభ్యుడు శ్రీ జె.కె.రెడ్డి ఎన్‌ఫోర్స్‌మెంట్, విజిలెన్స్, సేల్స్‌ట్యాక్స్, ఇన్‌కంట్యాక్స్ శాఖల్లో ఏ శాఖ సక్రమంగా పని చేస్తున్నదన్న విషయం మొదట ఆ శాఖలే సింహావ లోకనం చేసుకోవాలి. తరువాత ఇతర శాఖల్లో అవినీతి పరులైన వారి అంతు చూడాలని సలహా ఇచ్చారు. అంటే విజిలెన్సే లంచాలను మయమైనప్పుడు మీరేంది దొంగలను పట్టుకునేదని దబాయించా డన్నమాట. రాష్ట్రంలో వున్న లోప భూయిష్టమైన పన్నుల విధానం వల్ల ఎదుర్కొంటున్న సమస్యలను కూడా వివరించారు. గుంటూరు రేంజి డి.ఐ.జి. శ్రీ ఎస్.కె. జయచంద్ర మాట్లాడుతూ జిల్లా విజిలెన్స్ ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికారికి దోషులను అరెస్ట్ చేసే అధికారాలు కూడా వున్నాయి. వ్యాపారస్తులే సక్రమంగా పన్నులు చెల్లిస్తే ఇటువంటి స్టేషన్ల అవసర ముండేది కాదన్నారు. కొద్ది కాలంలోనే నెల్లూరులో ఎ.ఎస్.పి. శ్రీ డి. జనార్దన రెడ్డి 8 లక్షల నుండి 74 లక్షల మేర పన్నుల వసూలు పెంచినందుకు ప్రశంసించారు. సింహపురి సేవా సమితి అధ్యక్షులు శ్రీ ఆనం వివేకానంద రెడ్డి ఎన్‌ఫోర్స్‌మెంట్ స్టేషన్‌కు బడా బడా పెద్దలు నేరస్తులుగా వస్తారు కాబట్టి ఒక ఎసి లాకప్ రూం ఏర్పాటు చేయాలని చమత్కరించారు. వ్యాపార వర్గాల నుండి జిల్లా రైస్ మిల్లర్స్ అసోసియేషన్ అధ్యక్షులు రఘునాథ రెడ్డి, మంకు వెంకటేశ్వర్లు, పత్తి నరసింహులు శెట్టి, కనమర్లపూడి తిరుమల రావు, పెంచలు రెడ్డి ప్రసంగించారు. స్టేషన్ అధికారి శ్రీ డి. జనార్దన రెడ్డి తొలుత స్వాగతం చెప్పి చివరన వందనాలు చెప్పారు చివర్న ఇచ్చిన సింపుల్ టీ పార్టీలో విజిలెన్స్ అంతస్తుకు తగ్గకుండా నేతిలో

కొరవ 11 పేజీలో

* విజిలెన్స్ నేరస్తులంటే బడా వ్యాపారులు- వారి కోసం ఒక ఎసి లాకప్ రూం కట్టండి!

- ఆనం వివేకానంద రెడ్డి

* ఆర్ అండ్ బి, ఐడబ్ల్యుడి శాఖలు గబ్బు పట్టి పోతున్నాయి!

- సి.వి. శేషారెడ్డి

* ముందు మీ శాఖల్లోని అవినీతి మాన్పి తర్వాత వ్యాపారుల దగ్గరకు రండి!

- జె.కె. రెడ్డి

## స్వర్గానికి వెళ్లి సంఘంలోని అక్రమాలను నిరసించి వచ్చాడు కవి

# స్వర్గయానం

**గ్రంథసమీక్ష**

రచయిత
దేవరపల్లి నాగయ్య

సమీక్షకుడు
డాక్టర్ ఉడాలి నరశింహశాస్త్రి, యం.ఎ., పి.హెచ్.డి.

ప్రతులకు
నవోదయ పబ్లిషర్సు
ఏలూరు రోడ్డు
విజయవాడ - 520 002.

వెల
రూ. 35/-

మానవ జీవితంలో వృత్తి భుక్తికి, ప్రవృత్తి మానసిక రక్తికి మార్గ దర్శకాలు. అనుభవాన్ని బట్టి పరిశీలిస్తే వృత్తిలో వేరైనా కొంత మంది ప్రవృత్తిలో చక్కగా రాణిస్తున్నారు. ప్రవృత్తిలో రాణించా లంటే వృత్తిలో భిన్నులై వుండాలేమో అనిపిస్తుంది నాగయ్య గారి గ్రంథాన్ని సమీక్షించిన తర్వాత.

శ్రీ నాగయ్య గారు ప్రకాశం జిల్లా జరుగుమల్లి గ్రామ వాస్తవ్యులు. ప్రస్తుతం నెల్లూరు జిల్లా లేబర్ ఆఫీసర్‌గా వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తున్నారు. కవితా గురువు లేకుండానే ఆంధ్ర సాహితీ కేదారంలో పలు రచనలు పండించారు. కవి స్వాప్న శరీరంతో కవితా మేఘాన్నెక్కి పుట్టెడు భూలోకపు దురన్యాయాలు, దురాగతాలు, వికట కవిత్వాలు, కులమత వైషమ్యాలు, మానవ స్వభావ చిత్రణమున్నగు అంశాలను విశ్లేషిస్తూ సంభాషణాత్మక ధోరణిలో తట్టెడు ఆనందాన్ని అనుభవిస్తూ పాదాలరిగేటట్లు స్వర్గమంతా తిరిగి కవితా కరవాలాన్ని ఊహాస్వప్నంలో ఝళిపించారు.

"నిద్రాయాం మనసై వార్థోపలబ్ధి స్వప్న ఉచ్యతే" అని స్వప్న లక్షణం. ఈ లక్షణాలతో రూపు దిద్దుకొన్నదే స్వర్గయానం. కృతి రచనకు బీజంగా స్వప్న సాక్షాత్కార కథను చెప్పుట తెలుగు కావ్యావతారికలో కలదు. తిక్కన పోతనాదులు దీనికి తార్కాణం. కాని కవియే ఇక్కడ ఊహా స్వప్నంలో దివ్య పురుషుని సాయంతో మేఘమెక్కి స్వర్గయానం చేస్తాడు.

ఈ కావ్యంలో ధర్మ ప్రతిపాదన అంతర్లీనమై వుంది. అదే మత నిరపేక్షమయిన మానవ జీవిత ధర్మం. సంఘంలోని పాలకుల అక్రమ చర్యలు ఖండించుటకు, సమాజాభ్యు దయానికి, ప్రజా చైతన్యానికి కావలసినది కూడా కవిత్వమే. కవ్యాత్మను కావ్యాత్మతో జోడించే క్రమ స్వరూపిణి ప్రకృతి. ఈ కావ్యంలో ప్రకృతి వర్ణనలు ప్రబంధ కవుల కావ్య సమీక్షను స్మృతికి తెస్తాయి. వీరి కావ్యం సమష్టియా రూప శ్రీకారంతో అరంభమైంది. ఇంత సంప్రదాయానికి నోచుకొన్న ఈ కావ్యంలో కృత్యవతరణికా విభాగాన్ని విపులీకరించి ఉంటే బాగుండేది. కాని దానిలో భాగమైన కృతి పతి గుణగణాలను కావ్యారంభానికి ముందే వర్ణించడం సముచితంగా ఉంది.

స్వర్గయాన కావ్యం మూడు ఆశ్వాసాల ప్రబంధం. ప్రథమాశ్వాసం

కొరవ 8 పేజీలో



# XXXX ఎయిడ్స్

వింత శృంగారాలు, మత్తుపదార్థాలు, వ్యాధి నిరోధక శక్తిని హరిస్తాయి
ఇలాంటి వారినే మునుముందుగా 'ఎయిడ్స్' క్రిములు వరిస్తాయి.
విదప ఆ క్రిమికుండదు పక్షపాతం, అందరికీ అశని పాతం
ఇంద్రియం, రక్తం, లాలాజలం, కన్నీళ్ళు ఇలా రోగి శరీర ద్రవాలు,
వ్యాధి ఒకరి నుండి మరొకరికి వ్యాపించేందుకు తోడ్పడే ఉపద్రవాలు
హెచ్.ఐ.వి. వైరస్ ఈ రోగ భూతానికి కారణ భూతమని శాస్త్రం తేల్చింది
ప్రస్తుతం ప్రపంచంలోనే ఓ పైశాచిక వ్యాధిగా రూపుదాల్చింది.
మైకాల్ని, విచిత్ర శృంగారాల్ని, స్వలింగ సంపర్కాల్ని కూర్చింది
నాగరిక తెరలోని హద్దు మీరిన అనాగరికత తలవాల్చింది
నైటు క్లబ్బులు మబ్బుల మసకేసు కున్నాయి.
ముద్దులు కూడా ముసుగేసుకున్నాయి
లింఫు గ్రంధుల వాపు, నిరంతరం జ్వరం, అనంతరం
బేదులు కన్పిస్తాయి ఆదిలో
పిమ్మట సమస్త రోగ లక్షణాలగుపిస్తాయి. ఈ 'ఎయిడ్స్' వ్యాధిలో
వ్యాధి నిరోధక శక్తి లోపిస్తుంది, సకల రోగ లక్షణాలకు తావిస్తుంది
ఒకటనేల, క్యాన్సర్లు కూడా చుట్టుముట్టుతాయి, రోగిని మట్టుబెట్టుతాయి
వ్యాధి నివారణ వైద్యానికి వల్లకాదు, చేరక తప్పదు రోగి వల్లకాదు
నేటి వరకు తీసిన లెక్కల ప్రకారం ఇది అమెరికాలోనే ఎక్కువ
బరి తెగించిన అట్టి నాగరిక మమకారం గల దేశాలంటే దీనికి మక్కువ
అమెరికాలోనే అరవైవేల మంది వెళ్ళారు కాటికి, ఈ వ్యాధి ధాటికి!
మనకంతగా దాని ప్రేమ దక్కలేదు, నాలుగంకెలు మించి చిక్కలేదు!
అట్లని, అతిగా సోకబోదని లెక్కగాదు, అశ్రద్ధతో నిక్కరాదు
సకల మాదక ద్రవ్యదాసులారా, బృహన్నల్లారా, శిఖండులారా,
తెగిన గాలి పటాల్లారా, వికృత శృంగారాల్లో పండిన తాతలారా,
వ్యభిచారంలో పి.హెచ్.డి పట్టాలున్న పరమ పురుషులారా, చెడపకండి
దేశాన్ని చేతులారా-

**డా. జె.పి. రెడ్డి**
చర్మ, సుఖ, సెక్స్ స్పెషలిస్ట్
పొగతోట, నెల్లూరు.

ఎయిడ్స్ వ్యాధి నివారణా దినోత్సవం సందర్భంగా

## పోలీసు నిద్ర పోతున్నదా?

# రాపూరులో గంజాయి- అల్లూరులో నంబర్లాట!

రాపూరు మండలంలో ఇటీవల సారా ప్రియులు తగ్గు తున్నప్పటికీ, గంజాయి ప్రియులు రోజు రోజుకి పెరుగుతున్నారు. సారా నిషేధం తరువాత బ్రాంది రేట్లు సన్న కారు జనానికి అందుబాటులో లేక పోవడంతో గంజాయి విచ్చల విడిగా దొరుకు తుండడంతో పలువురు సారా ప్రియులు , గంజాయి బానిసలుగా మారారు. రాపూరు అగ్రహారం కట్ట, ఈదల చెరువు, పెద్ద చెరువు ప్రాంతాల్లో గంజాయి యథేచ్ఛగా దొరుకుతున్నది. ఈ వ్యాపారాన్ని ఎక్కువ శాతం మహిళలే నిర్వహిస్తున్నారు. గూడూరు నుండి పకడ్బందీగా ఆర్టీసి బస్సులలో తీసుకొస్తున్నారు. ఇటీవల గోనుపల్లి గ్రామంలో పెద్ద ఎత్తున గంజాయిని ఎక్సైజ్ సిబ్బంది దాడి చేసి స్వాధీనం

### జిల్లావార్తలు

చేసుకొన్నారు. కాని రాపూరు టౌన్‌లో మాత్రం ఏ దాడులూ జరపడం లేదు ప్రాథమిక దశలోనే ఈ దురలవాటును అరికట్టక పోతే ఎన్నో ఉపద్రవాలకు ఊతమిచ్చినట్లు వుతుంది.



దశాబ్ద విరామం తరువాత అంతర కళాశాల క్రికెట్ ట్రోఫీ గెల్చుకొన్న వి.ఆర్. కాలేజి జట్టుతో కరస్పాండెంట్ వివేకానంద రెడ్డి, ప్రిన్సిపల్ గోపాలకృష్ణ, ఫిజికల్ డైరక్టర్ దయాకర రెడ్డి

### అల్లూరులో జోరుగా నంబర్లాట!

అల్లూరు టౌన్‌లో డైలీ లాటరీలకు సంబంధించిన నంబర్లాట పోలీసుల పుణ్యమా అని మూడు పువ్వులూ ఆరు కాయల్లా సాగిపోతూంది. లాటరీ నెంబర్ల ముసుగులో సాగుతున్న ఈ కాటన్ మార్కెట్ మోజులో పడి ఇప్పటికే వందలాది కుటుంబాలు కుప్పకూలి పోయాయి. ఒక్క గ్రామంలో ప్రతినిత్యం 40 వేల రూపాయల మేర ఈ అక్రమ వ్యాపారం జరుగుతున్న దంటేనే దాని దుష్పరిణామం ఎంత తీవ్రంగా వుందో అర్థం చేసుకోవచ్చు. ఈ బుకింగ్ అంతా పాత బస్టాండ్‌లోని ఒక హోటల్, వ్యాపార సంస్థలతో పాటు ఇద్దరు మొబైల్‌బుక్కర్ల ద్వారా నడుస్తూంది. నెల్లూరు నుండి నెంబరు తెలిసాక డబ్బులు చెల్లించడం జరుగుతూ వుంది. ఈ కాటన్ మోజులో పడి బస్టాండ్‌లోని ముగ్గురు వ్యాపారస్తులు దివాళా తీసారు. మరెంతో మంది సన్నకారు, చిన్న కారు రైతులు ఈ మహమ్మారి

కొరవ 8 పేజీలో

# జవహర్ భారతిలో విద్యార్థుల సొమ్ము స్వాహా!

కావలి జవహర్ భారతిలో విద్యార్థులకు సంబంధించిన రెండు లక్షల రూపాయల నిధులు గుటకాయ స్వాహా అయ్యాయి. కాలేజికి అనుబంధంగా మూడు హాస్టళ్లున్నాయి. వీటికి తెచ్చే నిత్యావసర సరకులలో గోల్మాల్ చేసి ఈ నిధులు భోంచేశారట. హాస్టల్‌కు వచ్చే సరకులను ఎప్పటికప్పుడు ఆయా వార్డన్లు పరీక్షించాలి. కానీ వారికా ఓపిక లేదు. గుమాస్తాలు, అటెండర్ల పైన వదిలేస్తుంటారు. ఈ నిర్లక్ష్యం ఫలితంగా వచ్చే సరకుల పరిమాణానికి బిల్లులోని మొత్తానికి పొంతన లేకుండా పోయింది. ఒక్కొక్క సారి సరకులు లేకుండానే బిల్లులు తయారై పోయేవట. చెక్కులు బినామీ పేర్లతో జారీ చేయించి తలా కొంచెం పంచుకునే వారట. యాజమాన్యం విషయం గ్రహించే సరికే లక్షలు స్వాహా అయిపోయాయి. రమాపతి అనే ఒక వార్డను లెక్కలోనే రెండు లక్షల గోల్మాల్ కన్పించిందట. అతన్ని సస్పెండ్ చేసి విచారణకు ఆదేశించారు. విచారణ కమిటీలో తమకూ స్థానం ఇవ్వాలని విద్యార్థులు కోరుతున్నారు. విచారణ నిజాయితీగా, లోతుగా జరిగితే ఇదొక్కటే కాక వెలుగు చూడని ఇంకా ఎన్నో కుంభకోణాలు కూడా వెలికి వస్తాయని విద్యార్థుల నమ్మకం.

ఆదర్శ విద్యా సంస్థలకే ఆదర్శంగా వుండిన జవహర్ భారతికి ఏమిటీ దురవస్థ? రెక్టార్ గారూ - సరిదిద్దలేరా? ఓపిక తగ్గిందా!

### తుమ్మగుంటలో లక్ష బిల్వార్చన

తుమ్మగుంట అయ్యప్ప స్వామి దేవాలయంలో కార్తీక పౌర్ణమి పురస్కరించుకొని 28 తేది లక్ష బిల్వార్చన పూజా మహోత్సవం ఘనంగా జరిగింది. 50 మంది వేద పండితులు పల్లికొండ రాజశేఖర శర్మ, బి. చంద్ర శేఖర స్వాముల నాయకత్వాన మధ్యాహ్నం మూడు గంటల వరకు ఈ కార్యక్రమం నిర్వహించారు. కృతికా దీప దర్శనా నంతరం అఖండ కర్పూర హారతి వేడుక జరిగింది. భారీ సంఖ్యలో విచ్చేసిన శబరి భక్తులకు నెల్లూరు వాసి బత్తిన కుమార స్వామి రెడ్డి వుచిత ప్రసాదం అంద జేయగా తుమ్మగుంట అయ్యప్ప సేవా సమాజం భోజన సంతర్పణ చేశారు.



బి.వి. సుబ్బారెడ్డి, డి.ఇ., గారి కుమారుడు సురేంద్ర - మైథిలి వివాహం ఇటీవల తిరుపతిలో జరిగింది.

# స ణు గు డు

* రామోజీరావు మరీ సాటి పత్రికల పీక నులిమేస్తున్నాడు!
* మాట మీద నిలబడే వాడైతే ఎన్టీఆర్ లాంగ్ హనీమూన్‌కు వెళ్లాలి!

ఈనాడు రామోజీ రావు గారంటే నాకు తెలియని ఆకర్షణ; అభిమానం అన్నా అనవచ్చు. నిద్రాణ స్థితిలో, నిర్జీవంగా వుండిన తెలుగు పత్రికలను, పాఠకులను కూడా తట్టి, నిద్రలేపి, పరుగు లెత్తించిన ఘనత రామోజీ రావుదే. జమీన్‌రైతు వంటి చిన్న పత్రికలు దశాబ్దాల తరబడి- పల్లెటూళ్లకు పత్రికలు చేరాలని, పల్లెల వార్తలకు పత్రికలలో ప్రాధాన్యత నివ్వాలని కలలుకంటూ బావిలో కప్పల్లాగా వుండిపోతే, రామోజీ రావు ఆ లక్ష్యాన్ని పట్టుదలతో, దృఢ సంకల్పంతో నెరవేర్చాడు. దారి డొంకలు లేని, బస్సులు వెళ్లని లోకంతో సంబంధమే లేని గ్రామాలలోనూ ఈ రోజు ఈనాడు దర్శనమిస్తున్న దంటే - అది రామోజీ రావు అసమాన, అనుపమాన చాకచక్యం, వృత్తి నిపుణతల ఫలితమే. పశ్చిమ గోదావరి జిల్లాలో కాలువను తెప్ప పై దాటి కిలో మీటరు దూరం నడిచి వెళ్ల వలసిన ఒక కుగ్రామంలో మొన్నొక రోజు నేను అదే రోజు ఈనాడు పత్రిక చూశాను. అద్భుతమైన విషయమిది. పత్రిక మీద ఎంతో ఆసక్తి, అనురక్తి వుంటే తప్ప అటువంటి గ్రామాలలోని వారు అంత శ్రమ పడి పత్రిక తెప్పించు కోరు. కేవలం వార్తలు తెలుసు కోవడం వరకే అయితే టీవీలున్నాయి; రేడియో

### డోలేంద్ర

లున్నాయి. వార్తలను మించిన ఆసక్తి ఆ పత్రికకు వుండబట్టే, నల్ల మందుకు బానిసలైన వారి వలె పొద్దున లేవగానే దాని కోసం ఎదురు చూస్తున్నారు. అందులోనూ తెలుగు పాఠకుల చేత పత్రిక కొనిపించి, చదివించడం చాలా కష్టం. చిన్న చిన్న సరదాలకు వేలు ఖర్చు పెట్టే వారు కూడా పత్రిక కోసం రూపాయి వెచ్చించడానికి గిజగిజ లాడి పోతారు. ప్రక్క వాడి పేపరును తొంగి చూచి చదవడంలోనే మన వారికి సంతృప్తి. ఇటువంటి మనస్తత్వం కల్గిన పాఠకులున్న ప్రాంతంలో సర్క్యులేషన్

కొరవ 7 పేజీలో

## నెల్లూరు నలుచెర్లల్లో
### విమర్శకుడు

### జనార్థన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్థన రెడ్డి 8 తేది ఉదయం నెల్లూరు వస్తారు. టౌన్‌లో కార్యక్రమాలు, సర్వేపల్లి గ్రామాల్లో పర్యటన, సాయంత్రం ఇందుకూరు పేటలో పబ్లిక్ మీటింగు; 9 తేది వెంకటగిరి నియోజక వర్గంలో చివరి దశ రచ్చబండ సమావేశాలు. 10 తేది బహుశా తిరుగు ప్రయాణం - ఇంకా నిర్ణయం కాలేదు.

మధ్య ప్రదేశ్ ఎన్నికల పరిశీలకుడిగా వెళ్లడంతో, జనార్థన రెడ్డి అదృష్ట జాతకం ఆ రాష్ట్ర కాంగ్రెస్‌కూ అబ్బినట్లుంది. కలిసొచ్చిన చేయి అని కాబోలు, కొత్త ముఖ్యమంత్రి ఎన్నిక పర్యవేక్షణ కూడా ఆయనకే అప్పచెప్పారు. 3 తేది సాయంత్రం పిఎం ఆఫీసు నుంచి టెలిఫోన్ వర్తమానం అందుకొని హడావుడిగా ఢిల్లీవెళ్లారు.

జనార్థన రెడ్డి ఢిల్లీ నుంచి గట్టి పదవీ లాభంతో తిరిగి రావాలని అభిమానుల ఆకాంక్ష.

### ఎస్‌పి బదలీ - రాజకీయ రభస!

నెల్లూరు జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ టి. కృష్ణ ప్రసాద్‌ను హైదరాబాదుకు బదిలీ చేసి, అక్కడ సిబిసిఐడి విభాగంలో వుండిన శ్రీ రమణ మూర్తిని నెల్లూరులో నియమించారు.

కృష్ణ ప్రసాద్ బదలీ పెద్ద రాజకీయ రభసకు దారి తీసింది. కోవూరు ఉప ఎన్నికల్లో వచ్చిన విభేధాల వల్ల శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి, శ్రీ నెల్లపూరు రామచంద్రా రెడ్డి ద్వయం ఆయన బదలీకి పట్టుబట్టింది. ముఖ్యమంత్రి ఢిల్లీలో వున్నప్పుడు చెవిలో పోరి టెలిఫోన్‌లో ఉత్తర్వులు జారీ చేయించారు. కాని వారి వ్యతిరేక వర్గం దాన్ని నిలిపింది. ఆయన స్థానంలో నియమించిన రమణ మూర్తి చిత్తూరు, కరీంనగర్ జిల్లాల్లో పని చేసేటప్పుడు అవినీతి ఆరోపణలకు గురైనారట. ఆ విచారణ ఇంకా పూర్తి కాలేదు కాబట్టి, ఎస్‌పిగా వేయకూడదని డిజిపి చేత చక్రం అడ్డు వేయించారు. శ్రీ రమణమూర్తి ముఖ్యమంత్రి ప్రధాన కార్యదర్శి, శ్రీ ఎస్‌వి ప్రసాద్ బావమరిది; అందువల్ల అడ్డంకులు నిలువలేదు. ఆలస్యంగానైనా విడుదలై పోయాయి.

కృష్ణ ప్రసాద్ బదలీ పట్ల హరిజన సంఘాలు ఆందోళన చేస్తున్నాయి. ఇంకొక ప్రక్క ఎస్‌పిగా ఆయన హరిజనుల పట్ల ప్రత్యేక అభిమానం చూపాడని, కానిస్టేబిళ్ల నియామకాలు ఎస్‌ఐల పోస్టింగ్‌లు, హరిజనుల పై అత్యాచారం కేసుల్లో ఇది స్పష్టంగా కన్పడిందని ఒక అభియోగం వుంది. బదలీకి ముందు సుబ్బరామ రెడ్డి గారి ఉదయం దిన పత్రిక ఆయన పై అవినీతి ఆరోపణ చేసింది.

ఎస్‌పిగా వున్న కొద్ది కాలంలోనే ఇంత వివాదాస్పదం కావడం దురదృష్టకరం.

### డిఎంహెచ్‌ఒకు డీప్రమోషన్

నెల్లూరు వైద్య ఆరోగ్య శాఖాధికారి శ్రీ జె.సి. నారాయణను డీప్రమోట్ చేసి, అదే ఆఫీసులో అడిషనల్ డిఎం అండ్ హెచ్‌ఒగా నియమించారు. కారణం తెలియలేదు. కొత్త అధికారిగా కావలి ఆస్పత్రి సివిల్ సర్జన్ డాక్టర్ ఎ. జనార్థన రెడ్డి నియమితులైనారు.

### అల్లూరు ప్రిన్సిపల్ రాజీనామా

అల్లూరు రామకృష్ణా జూనియర్ కాలేజి ప్రిన్సిపల్ శ్రీ మేడా రమణా రెడ్డి తన పదవికి రాజీనామా చేశారు. ఏడాదిన్నరగా కాలేజిలో 4 లెక్చరర్, 8 టీచర్ పోస్టులు ఖాళీగా వున్నా యాజమాన్యం, విద్యాశాఖ పట్టించు కోవడం లేదని; పిల్లల చదువు పాడై పోతున్నా తాను నిస్సహాయంగా చూస్తూ వుండడం తప్ప ఏమీ చేయలేక పోతున్నానని, ఇంకొక ప్రక్క కాలేజి నిత్య వ్యవహారాలలో రాజకీయ నాయకుల జోక్యం మితి మీరి పోతున్నదని బాధపడుతూ, ఆవేదనతో రాజీనామా చేశాారాయన. ఎమ్మెల్యే ఇంటి గొడవలు కాలేజి పై ప్రసరించడంతో అది గబ్బు పట్టి పోయినట్లుంది. రమణా రెడ్డి స్వతహాగా సౌమ్యుడు; వివాద రహితుడు!

విష్ణువర్థన్ రెడ్డి గారూ - మీ స్వగ్రామంలోనే ఈ పరిస్థితు లేర్పడడం బాగా లేదండీ!

### ఎస్‌ఐల బదలీలు

ఎస్‌పి గారు వెళ్తూ, వెళ్తూ జిల్లాలోని సబిన్స్‌పెక్టర్లను పెద్ద ఎత్తున బదలీచేశారు. నెల్లూరు నాలుగవ టౌన్ ఎస్‌ఐ శ్రీనివాసులు రెడ్డిని ట్రాఫిక్‌కు, ముత్తుకూరు ఎస్‌ఐ మోహన రావును 4 టౌన్‌కు, మనుబోలు ఎస్‌ఐ వెంకట సుబయ్యను ముత్తుకూరుకు, ట్రాఫిక్ ఎస్‌ఐ సిహెచ్ వెంకటేశ్వర రావును 6 టౌన్ క్రైం స్టేషన్‌కు, అక్కడ ఎస్‌ఐ ఎస్‌ఐ షరీఫ్‌ను ప్రమోషన్ పైన ఐడి పార్టీ సర్కిల్ ఇన్స్‌పెక్టర్‌గా బదలీ చేశారు.

3 టౌన్ ఎస్‌ఐ జి. శ్రీనివాస రావును ట్రాఫిక్‌కు, రాపూరు ఎస్‌ఐ నవాబ్ జాన్‌ను 3 టౌన్‌కు, డిస పల్లి నుంచి ఎం. సత్యనారాయణను రాపూరుకు, విఆర్‌లో వున్న సాయి ప్రసాద్‌ను డిస పల్లికి బదిలీ చేశారు. కలువాయి ఎస్‌ఐ వెంకటస్వామిని విఆర్‌లో వుంచారు. డి.పి.ఓ.లో వున్న ఎస్‌ఐ గౌస్‌భాషాను కలువాయికి బదలీ చేశారు.

### పొన్నాలకు పదవి

నాటక రంగంలో నిష్ణాతుడైన మన పొన్నాల రామసుబ్బారెడ్డిని తెలుగు విశ్వవిద్యాలయం నాటక శాఖ పాఠ్య నిర్ణాయక మండలిలో సభ్యుడిగా నియమించారు. అర్హతకు తగిన పదవి ఇది. నటనలో రాటు తేలడమే కాదు - నాటకాల పట్ల నిర్దుష్టమైన అభిప్రాయాలు, వృత్తి నిపుణత కల్గిన ప్రతిభా వంతుడు రామసుబ్బారెడ్డి.



ఆయన ఆ పదవికి న్యాయం చేయగలడనే భావించాలి.

### మరణం

నెల్లూరు జిల్లా బిజెపి మాజీ అధ్యక్షుడు, కిసాన్ మోర్చా రాష్ట్ర శాఖ ఉపాధ్యక్షుడు శ్రీ ఇందుపూరు దశరథరామిరెడ్డి (65) 27 తేది ఉదయం నెల్లూరు నుంచి, స్వగ్రామమైన ముంగుమూరుకు వెళ్తూ లారీ ప్రమాదంలో మరణించారు. ఆయన స్కూటర్‌ను ఒక లారీ ఢీ కొట్టిందట. వెంటనే ఆస్పత్రికి తరలించినా ప్రయోజనం లేకుండా పోయింది.

### సణుగుడు

7 పేజీ కొరవ)

తిట్లు బూతుల గబ్బు పీల్చ లేక జనం ముక్కులు పగిలి పోతున్నాయి. ఆయినా పుణ్యం కట్టుకుంటే తెలుగు సోదరులు స్వచ్ఛమైన గాలి పీల్చుకో గల్గుతారు. రాజకీయాలు లేకుంటే తోచేదెట్లా అన్న దిగులు లేదు. కొత్త పెళ్లాంతో హాయిగా, హుషారుగా హనీమూన్‌కు చెక్కేయవచ్చు. వాన ప్రస్థాశ్రమం స్వీకరించాల్సిన దశలో శోభనపు అదృష్టం దక్కడం కంటె భాగ్యం ఏముంది? బసవ రామ తారకం క్యాన్సర్ ఆస్పత్రికి దండిన కోట్ల డబ్బు పెట్టెల్లో మూల్గు తుంది కాబట్టి - ఆ ఇబ్బందీ లేదు. తన పేరుతో జనాన్ని పీడించి దండిన సొమ్ము తన పతి దేముడి శృంగార క్రీడలకు వుపయోగ పడుతున్నందుకు ఆ మహా తల్లి ఆత్మ ఆ పరలోకంలో పరమానందం పొంది తీరుతుంది. అయ్యా రామారావు గారూ - ముహూర్తం త్వరగా పెట్టండి!

## సణుగుడు

(5 పేజీ కొరవ)

వెంచరమంటే, తివిరి ఇసుమున తైలం తీయడం క్రింది లెక్క. కేరళ, తమిళ నాడులకు భిన్నమైన వాతావరణం మనది. మనకంటే వారి జనాభా తక్కువ - కానీ కేరళ లోని ఒక ప్రసిద్ధ పత్రిక ఒక్క దాని సర్క్యులేషన్ మన తెలుగు దిన పత్రిక లన్నింటినీ కలిపినా ఎక్కువే వుంటుంది.

తెలుగు పాఠక లోకంలో ఇంతటి పరిణామం తెచ్చిన రామోజీరావుకు పాత్రికేయ ప్రమాణాల పట్ల, వ్యాపార నైతికత్వం పట్ల ఏ మాత్రం మన్నన లేక పోవడం దురదృష్టకరం.

ఒకసారి ఒక ఆంగ్ల పత్రిక వ్యాఖ్యానించింది - ''వేర్ జర్నలిజం ఎండ్స్, ఈనాడుయిజం బిగిన్స్'' - అని; ఆ అభిప్రాయం ఇప్పటికీ అక్షరాలా నిజం. పత్రికను ప్రచార సాధనంగా, వార్తను సమాచార సరఫరా ప్రక్రియగా భావించడం ఈనాడుకు అలవాటు లేదు. వారి దృష్టిలో పత్రిక ఒక అంగడి సరకు. సబ్బు బిళ్ల మాదిరో, టూత్ పేస్ట్ మాదిరో పత్రికను అంగడిలో పెట్టి, అమ్మేయాలని; పత్రికను చదివి పారేసే వస్తువే తప్ప దానికొక సామాజిక ప్రయోజనం, సాంఘిక బాధ్యత వుండనవసరం లేదనే వెర్రి వ్యాపార దృక్పథం తెలుగు పాత్రికేయ లోకానికి చెప్పరాని కీడు కల్గిస్తున్నది. జర్నలిజం నియమాలు, నైతిక ధర్మాల పట్ల వారికి కనీస పాటి మన్నన లేదు. వార్తకు ఈనాడు కొత్త నిర్వచనాలు ఇస్తున్నది. వార్త స్వరూపాన్ని, అర్థాన్ని మార్చి పారేస్తున్నది. దీని వల్ల ప్రజాభిప్రాయం రూపకల్పనలో పాఠకుడి ఆలోచనలను పెడదారి పట్టించడం ఒక ప్రమాదమైతే, కేవలం స్థానిక వార్తలతోనే పత్రికను నింపి ప్రపంచంలో ఏమి జరిగేది తెలుసుకోలేని పరిస్థితి కల్పించి పాఠకుడ్ని కూపస్థ మండూకంగా మారుస్తున్నది. సెన్సేషనలిజం వరదలో ముంచెత్తు తున్నది. పత్రిక బాగా అమ్ముకోవడానికి, తద్వారా ప్రకటనల ఆదాయం బాగా పెంచు కోవడానికి ఈ మార్గం ఉపకరించ వచ్చు; కాని ఆ ధోరణి వల్ల తెలియకుండా, స్లో పాయిజన్ వలె సమాజానికి, పాఠకుల వివేచనా శక్తికి సృజనాత్మకతకు జరుగుతున్న అపకారం భయానకమైనది.

ఇది చాలక, ఈ మధ్య సాటి పత్రికల పీక నులిమి వేయడానికి కొత్త కొత్త వ్యాపార వ్యూహాలు రచిస్తున్నారు. జిల్లా, సిటీ, టౌన్ పిల్ల పత్రికలతో ఇప్పటికే చిన్న పత్రికలు చచ్చి జీవచ్ఛవాలై పోయాయి. స్థానిక పత్రికలకు పరిమితం కావలసిన వార్తలు, వ్యాఖ్యలను లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డైలీకి ఎక్కించి, గొంతు నులిమేశారు. నెల్లూరు వార్త కావలిలో, కావలి వార్త చిరమనలో కన్పడకుండా పాఠకుల సమాచార పరిధిని కుదించి అపకారం చేస్తున్నారు. ఏ వూరి వార్తలు వారు, ఏ ఇంటి వ్యాఖ్యలు వారు చదువుకొని అదే ప్రపంచమని భ్రమసి పోయే పరిస్థితి కల్పించారు. చిన్న పత్రికల చావు పరిపూర్తి అయిందని కాబోలు, సాటి పెద్ద పత్రికల పై తన పులిపంజా విసురుతున్నది ఈనాడిప్పుడు. ఆంధ్రజ్యోతి, ఉదయం వంటి ఇతర పత్రికలు చదివే వారి చిరునామాలు దొంగ చాటుగా సంగ్రహించి ''ఈనాడు విశ్లేషణ'' పేరుతో డిక్లరేషన్ లేని కరపత్రాలు ముద్రించి, ఆ రెండు పత్రికలూ దగుల్బాజీవని పాఠకులలో దురభిప్రాయం కల్పించి, బలవంతంగా వాటిని మాన్పించి ఈనాడును కొన్పిస్తున్నారు. పోలీసుల సహాయంతో ఈ చవక బారు వ్యాపార ఎత్తుగడను అమలు పరుస్తున్నారు. చట్ట ప్రకారం డిక్లరేషన్ లేకుండా పత్రిక ప్రచురించడం నేరం. అటువంటి క్రిమినల్ చర్యను నివారించ వలసింది పోయి, రామోజీ రావుకు భయపడి నెల్లూరు అడిషనల్ ఎస్పి గారు వాటి పంపకానికి హామీ ఇచ్చారట; క్రింది అధికారులకు ఆదేశాలు జారీ చేశారట. పోలీసు అధికారులు ఇప్పటి వరకు రాజకీయ నాయకులకే గులాంలు అనుకున్నాము; ఇప్పుడు పత్రికా యజమాన్యాలకూ దాస్యం చేసే హీన స్థితికి దిగజారి పోయారన్న మాట.

పార్లమెంట్లు, అసెంబ్లీలు లేకుండా ఒక నియంత పరిపాలిస్తే, ఆ దేశానికి ఎంత కీడు జరుగుతుందో; ఒకే ఒక పత్రిక ప్రజల కందుబాటులో వున్నా అంతే కీడు జరుగుతుంది. అందులోనూ పలు రకాల వ్యాపార సామ్రాజ్యాలు, పరిశ్రమ జాగీర్లు వున్న వారి చేతిలోని పత్రికది ఏకచ్ఛత్రాధిపత్యమైతే ప్రజలు తీవ్రంగా నష్టపోతారు. ప్రజాస్వామ్య వ్యవస్థ సక్రమంగా పని చేయడానికి భిన్న అభిప్రాయాలు, భిన్న ఆలోచనా రీతులు ఎట్లా అవసరమో - సమకాలీన సంఘటనల పట్ల భిన్న విశ్లేషణలు, భిన్న వ్యాఖ్యలు ప్రజలకు చేరువలో వుండడమూ అంతే అవసరం. పత్రికా సామ్రాజ్యానికి తాను మకుటం లేని మహారాజుగా పరిగణింప బడాలనే దురాశతో రామోజీ రావు వంటి కసాయి వ్యాపార దృక్పథం గల వారు పాల్పడే కక్కుర్తి పనులను నిలువరించకుంటే సమాజానికి చేటు జరుగుతుంది. సరైన దారిలో నడిచి, సరైన దృక్పథంతో వ్యవహరించి పత్రిక పట్ల ప్రజాభిమానం పొందడానికి మాత్రమే రామోజీ రావు ప్రయత్నించాలని, తోటి పత్రికల పీక నులిమి స్మశానాన్ని పాలించాలనే దుష్ట బుద్ధి మానాలని ఆయనకు నా మనవి.

* * *

ఎన్టి రామారావు గారికి ఇప్పుడు భలే మంచి ఛాన్సు; పెళ్లయితే చేసుకున్నారు కాని హనీమూన్ వెళ్లే సావకాశమే దొరకలేదింత కాలం. అత్తగారింట అల్లుడి మర్యాదలు అందుకుందామని వెళ్తే పాడు జనం చుట్టిముట్టి ప్రాణం తోడేశారు. రాజకీయమే అంత. ఆ బాధ చూడలేక కాబోలు దేముడు ఆయన నోట రాజకీయ సన్యాసం మాట అన్పించాడు. ఉత్తరాది ఎన్నికల్లో ఏ ఒక్క రాష్ట్రంలో కాంగ్రెస్ గెల్చినా తాను రాజకీయ సన్యాసం తీసుకుంటానని చేతులు త్రిప్పుతూ చెప్పారాయన. ఆయన దృష్టం బాగుండి కాంగ్రెస్ ఒకటికి రెండు రాష్ట్రాలలో గెల్చింది; ప్రభుత్వా లేర్పాటు చేసింది. ఆయన ఛైర్మన్‌గా వుండే నేషనల్ ఫ్రంట్ మాత్రం డిపాజిట్లు కోల్పోవడంలో రికార్డు సృష్టించింది. ఐదు రాష్ట్రాలలో వారు సాధించిన సీట్లు లెక్కబెట్టినా రెండు చేతుల్లోని వేళ్లు ఇంకా మిగిలి పోయేట్లున్నాయి. నేషనల్ ఫ్రంట్ అనే ఘనమైన పేరు పెట్టుకున్న కూటమికి ఇంత కంటే సిగ్గుచేటు, పరువు తక్కువ ఇంకొకటి వుండదు.

తాను నేలమీద కంటే మాట మీద కదలకుండా, వంగకుండా, వంకర్లు తిరగకుండా నిలబడతానని డంబాలు పలుకు తుంటారు రామారావు గారు. అదే నిజమైతే ఆయనిప్పుడు ఆ సన్యాస మేదో స్వీకరించి ఆరుముప్పాతిక కోట్ల ఆంధ్రులను కనికరించాలని నా కోరిక! ఆ ఛండాలపు నోటి నుంచి వచ్చే

( కొరవ 6 వ పేజిలో )

## కల్తీసారా

(మొదటి పేజీ కొరవ)

వై.ఎస్. అక్రమంగా బెరైటీస్ తవ్వుకున్నాడని, రాయలసీమలో రాజకీయ హత్యలు చేయిస్తున్నాడని, దొంగ సారా వ్యవహారంలో డి.ఎల్. రవీంద్రా రెడ్డి పాత్ర వుందని దివాకర్ రెడ్డి వర్గీయులు ప్రత్యారోపణలు చేస్తున్నారు. కల్తీ సారా వ్యవహారం, జనం మరణాలతో మొదలైన వివాదం ఇప్పుడు పూర్తిగా వ్యక్తిగత దూషణలకు పరిమితమై పోయింది. రాతలో రాయలేని దుర్గంధ భూయిష్టమైన పదాలతో అటు వై.ఎస్. ఇటు దివాకర్ రెడ్డి తిట్టుకోవడం జుగుప్స కలిగిస్తోంది. ఈ తిట్లకు అంతు ఎక్కడో అర్థం గాక ముఖ్యమంత్రి సతమత మవుతున్నారు. ఈ నేపథ్యంలో వై.ఎస్. తన రాజీనామా లేఖను ప్రధానికి పంపి మరో వివాదం రేపెట్టారు. తాను అక్రమంగా గనులు తవ్వుకున్నట్లు రుజువయ్యే పక్షంలో తన రాజీనామాను స్పీకర్‌కు పంపాలని ఆయన ప్రధానికి రాసిన లేఖలో కోరారు. కాగా వై.ఎస్.కు చెందిన మంగంపేట గనుల సమీపంలో మాన్యుమెంట్ కింద ప్రభుత్వం వదిలిన బెరైటీస్ నిక్షిప్తాలను వై.ఎస్. ఆయన తండ్రి రాజారెడ్డి అక్రమంగా తవ్వుకున్నారన్న ఆరోపణల పై విచారణ జరిపిన శాసన సభ సభా సంఘం వై.ఎస్.కు వ్యతిరేకంగా నివేదికను సమర్పించింది. ఈ నివేదిక ఇంకా సభ ముందుకు రావల్సి వుండగా పత్రికల్లో లీక్ అయింది. అయితే తన వ్యతిరేకులైన ఇరువురు సభ్యుల్ని అప్పటి ముఖ్యమంత్రి ఎన్. జనార్దన రెడ్డి సభా సంఘంలో నియమించటమే గాక ఒరిజనల్ నివేదికలో లేని రెండు పేరాలను ఇరికించి తన పై బురద చల్లారని వై.ఎస్. ఆరోపించారు. మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్దన రెడ్డి ఈ ఆరోపణలు పూర్తిగా నిరాధారమని, తాను ముఖ్యమంత్రిగా వుండగా సభా సంఘాన్ని నియమించినప్పటికీ నివేదిక మాత్రం విజయభాస్కర రెడ్డి గారి హయాంలో సమర్పించడం జరిగిందని, దీంట్లో తన ప్రమేయం ఎంత మాత్రం లేదని అంటున్నారు. దీనితో అత్యున్నతమైన శాసన సభ నివేదికకు కూడా రాజకీయ గ్రహణం పట్టింది.

ముఖ్యమంత్రి ఈ తలనొప్పితో ఢిల్లీ వెళ్లారు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశంలో పాల్గొనేందుకు ఆయన ఢిల్లీకి వెళ్లారని, ఈ వ్యవహారాల్ని ప్రధాన మంత్రితో చర్చిస్తారని అంటున్నారు. ప్రధాన మంత్రి సీమ రాజకీయాల్లో వేలు పెడ్తారా? అన్నది సందేహమే. ఆ తలనొప్పి ఏదో ముఖ్యమంత్రినే భరించమని ప్రధాని చెప్పే అవకాశముందని అభిజ్ఞ వర్గాల భోగట్టా. కాగా పిసిసి అధ్యక్షుడు మజ్జి తులసీదాస్ ఈ వివాదం పై స్పందించి తిట్టుకుంటున్న వారందరికీ షోకాజ్ నోటీసులు జారీ చేశారు. అయితే ఎవరూ ఆ నోటీసుల్ని సీరియస్‌గా తీసుకున్నట్లు కనబడటం లేదు. రాయలసీమ ఇంకా తిట్లతో, బూతుల్తో మార్మోగుతూనే వుంది. కల్తీ సారా మరణాల పై నియమించిన న్యాయవిచారణ ఇంకా మొదలు కాలేదు. న్యాయవిచారణలో రాజకీయుల పాత్రను కూడా చేర్చి ముఖ్యమంత్రి తన చేతులు కడుక్కున్నారు. ఈ సంఘటనలో నిజానిజాలెలా వున్నా, దోషులెవరైనా కాంగ్రెస్ పార్టీకి దీని వల్ల జరగాల్సిన నష్టం జరిగింది. ప్రతిపక్షాలు కూడా దీన్ని రాజకీయ ప్రయోజనాలకు ప్రధాన అస్త్రంగా ఉపయోగిస్తున్నాయి.

## గ్రంథసమీక్ష

(4 పేజీ కొరవ)

ఆకాశ విహారంగాను ద్వితీయాఖ్యానం స్వర్గవిహారంగాను తృతీయాఖ్యానం పునరాగమనంగాను చిత్రించారు. కవి దివ్య పురుషుని సహాయంతో మేఘ వాహనుడై ఆకాశ గంగా స్నానం చేసి ఫల రసాస్వాదన చేసి భూలోకపు స్థితి గతులను కుల మత వైరాల్యాలను వర్ణించి స్వర్గం చేరుతారు. అచట ఆకాశాన్నంటే భవనాలు, పూదోటలు, సరస్సులు, అరణ్యాలు, పర్వతాలు చూచి ఆనందిస్తూ గాంధీ, ఇందిరా గాంధీలతో నేటి కుహనా రాజకీయాలను వర్ణించి, జాషువాను కలసి కులగజ్జిని, చెర్రితలలు వేస్తున్న నేటి కవితలు వెక్కిరిస్తారు. స్వర్గంలో అమృతం త్రాగి, ప్రకృతికి పరవశులై, తిరుగు ప్రయాణంలో రాజీవ్‌ను దర్శిస్తారు. దివి నుండి భువికి దిగుతూ వీలగిరి ఊటీల మీదుగా అంచెల ప్రయాణంతో సూర్యోదయానికి ఇల్లు చేరుతారు. భూలోకపు స్థితి గతులు, దివ్యలోకపు స్థితిగతులతో తులనాత్మ కార్యయనం చేస్తారు. ఇక వీరి కవితా రసాయనాన్ని చవి చూద్దాం.

ప్రకృతి మానవ హృదయాన్ని ఎలా పరవశింప చేస్తుందో చూడండి

''ఎంత చక్కని గాలియో యెంత
సుఖమొ
ఎంత కోయిల పాటయో యెంత
ధృతియొ
ఎన్ని ప్రాణుల రాకయో యెంత నెలవొ
ఎంత యనుభూతియో కోర్కెకెంత
ఫలమొ''

ఈ కవి ప్రకృతిని మానవీకరించారు.

కులగజ్జితో మ్రగ్గుతున్న మానవ సమాజాన్ని చీదరించు కొంటూ సృష్టిలో కులం లేదన్నారు. కులావిర్భావం నైష్ఠికుల నైచ్యానికి దర్పణ మన్నారు. కులకుత్సితులను ఇలా దుయ్యబట్టారు.

''దైవ మెరుగునట్టి తప్పులనొప్పుగా
చెప్పి చేయుచున్న చెడుగులకును
కులము నెంచునట్టి కుత్సితాత్ములకును
స్వర్గ ప్రాప్తిలేదు చావు తప్ప''

నరునికొల్చే నరుని నాస్తికుడంటూ వారిని భగవద్ద్రోహులుగా చిత్రించారు

''కానమనుజాడెవడుమానవీయుడు కాడు
మాననీయుడొకడె మహిమవిభుడు
మహిమవిభునివిడిచి మానవాళిని గొల్చు
నరుడు తప్పకుండ నాస్తికుండు''

ఇక మతాన్ని వివరిస్తూ మత సామరస్యం లేని వాడు సంఘద్రోహి యన్నాడు. పరమత సహనం కావాలన్నాడు. మతాన్ని నిర్వచిస్తూ మతాల గమ్యం అమర పథమన్నాడు.

''కాని మతసామరస్యంబు లేనివాడు
సంఘవిద్రోహి యగును నిస్సందియముగ
పరమతంబునుద్వేషించు భక్తవరుడు
పరమ వాసుని దృష్టిలో పాపరతుడు''

కోర్కెల నిచ్చే కల్ప వృక్షం అందుబాటులో ఉన్నా ఏమీ కోరని ఈ కవి తన నిష్కామ యోగాన్ని వ్యక్తం చేసాడు.

అరణ్యంలో మృగాలను వర్ణిస్తూ అవి జాతి వైరు మాని జీవించే విధానం స్వర్గ మహిమకు దృష్టాంత మన్నాడు.

స్వర్గయానంలో గాంధీ గారితో సంభాషిస్తూ జాతి విముక్తికై ప్రాణాలు విడిచిన ఆయన రాజకీయం నేడు రౌడీలచే చిక్కి నడి వీధులలో తిరుగు వేశ్య అయిందన్నారు.

ఇందిరమ్మ సంభాషణలో కవి యొక్క ఆవేదన యిలా స్పష్టమైంది.

''కొడుకు కొడంద్రు కుశలమే గొప్ప
తల్లి
ప్రొద్దు పొడుచు మంగ్రుడు
మంటుదమి యందు
తనరు మన్నది ధర్మంబు తప్పకుండ
తప్పు మన్నారు మనుజాందు
ధర్మపథము''

అంటే ప్రకృతి తన ధర్మాన్ని తాను పాటిస్తున్నది. కాని మానవుడు తన ధర్మాన్ని తాను పాటించడం లేదన్నాడు.

స్వర్గయానంలో స్వప్నయానం కవి కుండే తార్కిక శక్తిని, ప్రకృతి పరిశీలనా తత్వాన్ని, వస్తు వివేచనా శక్తిని, ప్రాపంచిక స్థితి గతులను, ఆధ్యాత్మిక తత్వాన్ని, విశదం చేస్తున్నవి. వృజినము, మండము, సలిగె, నెళవరి, ముకురు ఇత్యాది విశిష్ట ప్రయోగాలు కవికి గల వివిధ నిఘంటు పరిజ్ఞానాన్ని స్పష్టం చేస్తుంది. రాశిలో వాసిలో సమ తూకం గలది ఈ కావ్యం.

---

## గ్రామ పంచాయితీ కార్యాలయము - కోవూరు

ROC No. 134/93A1, -- 2.12.93తేది

# టెండరు నోటీసు

నెల్లూరు జిల్లా కోవూరు మండలం, కోవూరు గ్రామ పంచాయితీకి ఈ క్రింది వస్తువులు సరఫరా చేయుట, పనులు చేయుట మరియు వేలం వేయుటకు 18.12.93 తేది మధ్యాహ్నం 2 గంటల వరకు కార్య నిర్వహణాధికారిచే గాని వారి అనుమతి పొందిన వారిచే గాని గ్రామ పంచాయితీ కార్యాలయములో సీలు వేసిన టెండర్లు స్వీకరించబడి అదే రోజు మధ్యాహ్నం 2.30 గంటలకు హాజరైన టెండరు దార్ల సమక్షమున టెండర్లు తెరువ బడును. టెండరు ఫారములో ఈ క్రింది తెలిపిన విధముగా టెండరు ధరావత్తు చెల్లించి రశీదు జత పరచ వలెను. ధరావత్తు చెల్లించని టెండర్లు స్వీకరించ బడవు. మిగతా వివరములు పంచాయితీ కార్యాలయము పని వేళలందు తెలుసుకొన వచ్చును.

| వ.నెం. I | సరఫరా వివరములు | చెల్లించ వలసిన ధరావత్తు |
|---|---|---|
| 1) | కోవూరు గ్రామ పంచాయితీలో పని చేయుచున్న ప్రజారోగ్య సిబ్బందికి శానిటరి ఇన్‌స్పెక్టరు, మేస్త్రీలు మరియు ఆటెండరుకు 1993 - 94 సంవత్సరమునకు కాని బిన్ని యూనిఫారం మరియు ఆఫ్కో కంపెని చీరలు రవికలు సప్లయి చేయుట మరియు 2 మీటరుల రంగుల తలపాగాలు సప్లయి చేయుట. | రూ. 200.00 |
| 2) | కోవూరు గ్రామ పంచాయితీలో పని చేయుచున్న ప్రజారోగ్య సిబ్బంది మరియు శానిటరి ఇన్స్‌పెక్టరు, మేస్త్రీలు, ఆటెండరుకు 1993 - 94 సంవత్సరం పాద రక్షలు సప్లయి చేయుట. | రూ. 100.00 |

| II | పనులు | ఎస్టిమేటు విలువ | చెల్లించ వలసిన ధరావత్తు |
|---|---|---|---|
| 1) | మంద బయలు వద్ద గల మిని రక్షిత మంచి నీటి సరఫరా పథకం ట్యాంకు నిరుపయోగముగా వున్నందున షాపింగ్ కాంప్లెక్సు నిర్మాణము చేయుట. | రూ. 12,000/- | రూ. 600/- |
| 2) | పోలేరమ్మ బావి వద్ద గల మినీ రక్షిత నీటి సరఫరా ట్యాంకు నిరుపయోగముగా వున్నది. షాపింగు కాంప్లెక్సుగా నిర్మాణం చేయుట. | రూ. 15,300/- | రూ. 765/- |

| వ.నెం. I | వివరములు | చెల్లించ వలసిన ధరావత్తు |
|---|---|---|
| 1) | పాత పంచాయితీ కార్యాలయపు తొలగించిన పాత కొయ్య సామానులు అనగా కొయ్య ద్వార బంధములు, కిటికీలు బహిరంగంగా వేలం వేయుట. | రూ. 100/- |
| 2) | పాత పంచాయితీ కార్యాలయపు తొలగించ బడిన కొయ్య పెండి దబ్బలు బహిరంగముగా వేలం వేయుట | రూ. 50/- |

**యం.డి. ఇస్మాయిల్**

కార్యనిర్వహణాధికారి, కోవూరు, గ్రామపంచాయితీ - నెల్లూరు జిల్లా

---

# శివారెడ్డి పద్యాలు

### శుభలేఖ

పద్మనాభ రెడ్డి! పంపారు శుభలేఖ
అందుకున్న కనుల కద్దుకున్న,
ఇక్కడుంద తిరుపతెదుంది మ్యారేజి?
ఏడమెయిలా? కారా? యెక్కిరాను?

### స్వామి బ్రహ్మానంద(అవధూత)

వస్తు వస్తు కవిని స్వామి బ్రహ్మానంద
ఆశ్రమానికొల్ల ఆకలైతె,
స్వాములోరు కవికి సంభావనిచ్చాడు
యింత గద్ద స్వీటు, ఏమి స్వీటు!

స్వీటు, లడ్డు బల్ల, క్షీరాన్న మక్కర్ల,
బాదుషాలు బల్ల బడుగు కవికి!
శాస్త్రకూస్తా తీర్థమిస్తె అంతెజాలు!
ఇంతకంటె భాగ్యమేమి లేదు!

### ఏడుకొండలోడు

ఏడుకొండలోడు ఏమైయ్యి పొయ్యాడు
కానరావడంట కంట్లొబల్ల
క్రొత్తక్రొత్త గుళ్లు కోట్లాది దేవుళ్లు
ఎక్కువైంది భక్తి, యెద బట్ట!

### టి.వి.లో బ్యాట్‌మెంటు

ఆడపిల్ల లార! అపరంజిబంగారు
బొమ్మలార, ముద్దు గుమ్మలార
వద్దు బ్యాటుమెంటు వదిలేసి స్కూలల్లో
చేరిపోండి! చెప్పేదినంతి!

### గోల్డ్ డేసు

పిలువ బల్ల వచ్చి పెల్లిళ్ల మాటంటె
పరుగులెత్తెవాళ్లి పరుతులేస్తు,
అయొక గోల్డు డేసు, ఆరోజాలికరావు
పాఠకులకు మీకు ప్రతిది దెలుసు!

---

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### అల్లూరు కేసు

అల్లూరు అప్పీలులో ఆర్గురి శిక్షలు రద్దుచేస్తూ, దంపూరు, సుబ్బారెడ్డి, పోలంరెడ్డి సుబ్బరామిరెడ్డి, ఉమ్మారు ఆదిశేషారెడ్డి, బేగా రామచంద్రారెడ్డి, గూడూరు పుల్లయ్య, బెల్లం సుబ్బులు గార్ల ఆర్గురి శిక్షలు (4సం.చె.) ఖాయం చేశారు.

---

## జిల్లావార్తలు

(5 పేజీ కొరవ)

మోజులో పది వేలాది రూపాయలు పోగొట్టు కుంటున్నారు. పోలీసుల ముందే ఇదంతా జరుగుతున్నా పట్టించుకోక పోవడానికి ప్రతి నిత్యం వారికి అందుతున్న మామూళ్లేనని తెలుస్తూంది. ఇటువంటి అరాచక వ్యాపారాలను అరికట్ట వలసిన పోలీసులు మామూళ్లతో సరిపెట్టు కోవడం పై విమర్శలొస్తున్నాయి. అల్లూరు పోలీస్ స్టేషన్ నెల్లూరు రూరల్ పరిధిలోనిది. డిఎస్‌పి గారైనా ఒకసారి వచ్చి పరిస్థితి పరిశీలించి కొన్ని కాపురాలైనా నిలబెట్టాలి.

### గూడూరులో ఉచిత నేత్ర చికిత్సా శిబిరం

గూడూరు రోటరీ క్లబ్, హైదరాబాద్‌కు చెందిన శ్రీ డి.ఎల్.ఎన్. రాజా సహకారంతో ఉచిత నేత్ర చికిత్సా శిబిరాన్ని నిర్వహిస్తుంది. కర్నూలుకు చెందిన డాక్టర్ కె. బాలకృష్ణ మూర్తి నాయకత్వంలోని వైద్యుల బృందం 10 తేది డి.ఎస్.ఆర్. కమ్యూనిటీ హాల్‌లో పరీక్షలు నిర్వహించి, 11 తేది అవసరమైన వారికి ఆపరేషన్లు చేస్తారు. 300 మంది పేషంట్లకు ఆపరేషన్లు చేయడానికి వసతులు ఏర్పాటు చేయడంతో పాటు ఆపరేషన్ చేయించు కొన్నవారికి మందులు, కంటి అద్దాలు ఉచితంగా ఇస్తారని క్లబ్ కార్యదర్శి రొటేరియన్ శ్రీ కె.ఆర్. రెడ్డి తెలిపారు.

### వెంకటగిరి నీటి కొరత తీరింది

నీటి కరువుతో అల్లాడి పోతుండిన వెంకటగిరి ప్రజలకు ఇటీవల కురిసిన వర్షాలు ఆ కొరతను తీర్చాయి. అక్టోబర్ నెల చివరి వారం నవంబర్‌ను కలుపుకొంటె 852 మిల్లీ మీటర్ల వర్షం అంటె 33 పదున్లు ఈ ప్రాంతంలో నమోదైంది. బావులు, చెరువులు పుష్కలంగా నిండాయి. ఐదు చెరువులు తెగాయి. వర్షా భావ పరిస్థితులతో అల్లాడుతున్న రైతులు సమృద్ధిగా పడిన వర్షాలతో ఆశా జనక పరిస్థితి తలెత్తి వ్యవసాయ పనులలో నిమగ్నమై యున్నారు.

---

## పంచాంగము

### డిసెంబరు తిథులు

కార్తీక బహుళ

తే4 శని పంచమి ఉ.గ. 10.10 వ
తే5 ఆది షష్ఠి ఉ.గ. 9.47 వ
తే6 సోమ సప్తమి ఉ.గ. 8.00 వ
తే7 మంగళ అష్టమిఉ.గ. 6.27 వ
తరువాత పూర్తిగ నవమి
తే8 బుధ దశమి రా.గ. 1.40 వ
తే9 గురు ఏకాదశి రా.గ. 11.10 వ
తే10శుక్ర ద్వాదశి రా.గ. 8.50 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ

### తెలుగు నిర్మాతలు తారలను మరీ చెడిపి పారేస్తున్నారు!

# అమెరికాలో ఇల్లు - మద్రాసులో షూటింగ్!

తారల రేట్లను పెంచడంలో గాని, చిత్ర నిర్మాణ వ్యయం పెంచడంలో గాని తెలుగు నిర్మాతల పొరబాటు అంతా ఇంతా కాదని తమిళ సినిమా రంగంలోని వారి అభిప్రాయం. పెళ్ళి చేసుకుని, అమెరికాలో స్థిరపడిన నదియా చేత ఒక తమిళ నిర్మాత మళ్ళీ నటింపజేస్తే, తెలుగు నిర్మాతలు ఆమె రేటును అయిదు లక్షలకు పెంచారట. ఆమె హీరోయిన్‌గా ఉన్నప్పుడు రెండు లక్షలకు మించి ఏ తమిళ నిర్మాతా ఇవ్వలేదు. పైగా ఇప్పుడు ఆమెకు అత్తింటి వైపు గుబులు మళ్లినట్టుంది. 1 నెలలో 14 రోజులు ఇండియాలో ఉండి షూటింగ్‌లలో పాల్గొంటాను. మిగతా రోజులు అమెరికాలో ఉంటాను అంటోందట. ఈమె వెంటనే కాల్‌షీట్లు సర్దుబాటు చేయడం కోసం పారితోషికం అయిదు లక్షలకు పెంచారు తెలుగు నిర్మాతలు! మాకంత కర్మ పట్టలేదు. పైగా, ఈమె కాల్‌షీట్లు ఇచ్చినప్పుడే షూటింగ్‌లు చేసుకునేంత గ్రహచారం మాకేముంది? ఈమెకు ఏమాత్రం తీసిపోని ఇతర నటీమణులెందరు లేరు?'' అని ఇటీవల ఒక సుప్రసిద్ధ తమిళ నిర్మాత అన్నాడు.

## దూరపు కొండలు నునుపు

సినిమా తారలూ మామూలు మనుషులే. కాని, వాళ్ళల్లో కొందరు వెండితెరపై ప్రదర్శించే అద్భుతమైన నటనకు భ్రమసి వారి అభిమానులుగా మారి, వారిని చూడడానికి ఇంట్లో చెప్పకుండా మద్రాసుకు పరారవడం తరచూ జరుగుతున్న విషయమే. ఇటీవల వెంకటగిరిలో 8 వ తరగతి చదువుతున్న ప్రసాదరావు కూతురు ప్రతిమ (13), వేణుగోపాల్ కూతురు కల్యాణి (14), వెంకట రమణయ్య పుత్రిక సుకన్య ఈ మోజులో పడ్డారు. స్కూలు ఫీజు కట్టడానికి ప్రతిమ ఇంట్లో ఇచ్చిన అయిదువందల రూపాయలతో తన స్నేహితురాండ్రను కలుసుకుంది. ముగ్గురూ బస్సులో మద్రాసుకు బయలు దేరారు. త్యాగరాయనగర్‌లో ఇక్కడా అక్కడా తిరిగారు. చివరికి ఎలక్ట్రిక్ ట్రెయిన్‌లో ఎగ్మూర్ స్టేషన్‌కు చేరుకున్నారు. అక్కడ కొందరి వద్ద సినిమా తారల గురించి వాకబు చేస్తూండగా లేడీపోలీస్ హెడ్‌కానిస్టేబుల్ శ్రీమతి ఆర్యమాల దృష్టిలో పడ్డారు. ఆమె మెల్లగా ఆరాతీసింది. ఆ అమ్మాయిల గురించి వెంటనే వెంకటగిరిలోని వాళ్ళ తల్లిదండ్రులకు తెలియజేసింది. పెద్దలు వచ్చేవరకు ఆ అమ్మాయిలను రైల్వేపోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టర్ లీలాబాయి, మహిళా కానిస్టేబుల్స్ జానకమ్మ, విజయ, చంద్రిక, గీత కంటికి రెప్పల్లా చూసుకున్నారు. సినిమా తారల మోజులో తమిళనాడు నుండి ఎవ్వరూ మద్రాసుకు రారుకాని, మనరాష్ట్రం నుంచే అడపాదడపా అమాయకురాళ్ళు వస్తున్నారు. దురదృష్ట వశాత్తు దుర్మార్గుల బారిన పడితే వీరికి అధోగతే.

## "ఎస్..నేనంటే నేనే!"

ఇది కృష్ణ హీరోగా విజయ నిర్మల దర్శకత్వంలో తయారయ్యే

# సిల్క్‌స్మిత పుణ్యమా అని శాలిగ్రామం మగవాళ్లంతా సన్నబడి పోతున్నారు!

సిల్క్ స్మిత అప్పుడప్పుడు తమాషాగా మాట్లాడ్తూ, చుట్టూ ఉన్న వారిని నవ్విస్తూంటుంది. ఈమె ఇటీవల విసిరిన కొత్త జోక్ - "మద్రాసులో నేనుండే శాలిగ్రామం ప్రాంతంలో క్రమక్రమంగా స్థూలకాయులు సన్నబడతారు. చాలా మంది బొజ్జలు కరిగి, ఆరోగ్య వంతులుగా తయారవుతారు. కారణమేమిటంటే - ఇటీవల నేను ప్రతి రోజూ ఉదయం అయిదు గంటలకు ముందే లేచి, ఆ ప్రాంతంలో వాకింగ్ వెళ్లడం మొదలెట్టాను. ఈ విషయం చాలా మందికి తెలిసినట్లుంది. వాళ్లు నన్ను చూడ్డానికి నాకన్నా ముందే వాకింగ్‌కు తయారవుతున్నారు. నా ముందూ వెనుకా కొంత దూరం నడుస్తున్నారు కూడా. అలా నా వల్ల వాళ్లు దేహపరిశ్రమ చేస్తున్నారన్న మాట. వాళ్లకు మంచిదేగా?''

## పారిశ్రామిక రంగంలో తారలు

తెలుగు సినిమా రంగంలో ఇప్పుడు అనిశ్చితమైన వాతావరణం నెలకొని వుంది గనుక కొందరు తారలు ఏదైనా వ్యాపార రంగంలో ప్రవేశించాలనే తలంపులో ఉన్నారు. వీళ్లకు స్ఫూర్తి - శారద యాజమాన్యంలో లోటస్ చాక్లెట్ కంపెనీ ఉత్పత్తి చేసిన ఐదు రకాల చాక్లెట్లు మార్కెట్లో విపరీతంగా విక్రయం కావడం! కృష్ణంరాజు తన మిత్రులతో కలిసి 18.20 కోట్ల పెట్టుబడితో మెదక్ జిల్లా, రామాంతపూర్ వద్ద గోపీకృష్ణా గ్రానైట్స్ ఇండియా లిమిటెడ్ సంస్థ నెలకొల్పారు.

కొరవ 11 పేజీలో

సరాగాల సరిగమ లాలపిస్తున్న రంభ

# ఇంక బాస్‌లు బాది పారేస్తారేమో!

దర్శక నిర్మాత విజయ బాపినీడు త్వరలో చిరంజీవితో రూపొందించే చిత్రం "బిగ్‌బాస్" విజయశాంతితో కోడిరామకృష్ణ దర్శకత్వంలో శివరాజా, వెంకట్రాజు నిర్మించే చిత్రం పేరు "లేడీబాస్". కొంతకాలం రౌడీ టైటిల్ పరిశ్రమను పరిపాలించింది ఇప్పుడిక "బాస్" టైటిల్స్‌తో ప్రేక్షకులను బాది పారేస్తాయేమో!

## జయసుధ చిత్రంలో బాలకృష్ణ

"ఆది దంపతులు, కాంచన సీత, కలికాలం, వింతకోడళ్ళు" అనంతరం జయసుధ సమర్పించే జె.ఎస్.కె. కంబైన్స్ చిత్రంలో బాలకృష్ణ హీరో. ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకుడు. బాలకృష్ణ ఇటీవల బయటి చిత్రాలు తగ్గించుకొని, తన స్వంత నిర్మాణ సంస్థ మీదే సంపూర్ణ దృష్టి కేంద్రీకరించాడు. చక్కని కథల కోసం కంచుకాగడా పట్టి అన్వేషిస్తున్నాడు.

## మళ్లీ తెలుగులో భానుప్రియ

ఇంతకాలం భానుప్రియను తమిళ నిర్మాతలు దత్తుకు తీసుకున్నారు. తెలుగు తెరకు తాను దూరమైనందుకు ఆమె వాపోతూ వచ్చింది. తమ్మారెడ్డి భరద్వాజ దర్శకత్వంలో అమూల్య ఆర్ట్స్ నిర్మించే చిత్రంలో ఆమె బుక్ అయింది. ఈమెతో పాటు మాలశ్రీ, ఒక బొంబాయి నటి ఇతర నాయికలు. సుమన్ హీరో.

# సరదా చిత్రం - చిన్నల్లుడు!

### చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాల రావు

శరత్ దర్శకత్వంలో తయారైన "చిన్న అల్లుడు" సినిమాలో గిరీశం, రాజా, కోటీశ్వర రావు ముఖ్య పాత్రలు కాగా శ్రీకాంత్, అతని తండ్రి ఉపపాత్రలు. రాణి, సీత మరికొన్ని అదనపుపాత్రలు. గిరీశం పెళ్ళిళ్ల పేరయ్య వృత్తితో జీవిస్తుంటాడు. రాజా బస్టాండు లైసెన్సు కూలీగా బ్రతుకు లాగిస్తుంటాడు. కోటీశ్వర రావు లక్షాధికారి, పిసినారి. తన ఇద్దరు కూతుళ్లను రాణి, సీతలను కోటీశ్వరుల ఏకైక పుత్రులకిచ్చి తద్వారా కోట్లకి పడగెత్తాలను కుంటాడు. తాను కోటీశ్వరుడైన తర్వాత ఉన్న డబ్బు కరిగి పోకుండా తన జీవితం సాగించేందుకు బస్టాండులో కూలీగా పని చేసేందుకైనా సిద్ధం అంటాడు. డబ్బుకు గడ్డి తినే రకంగా రుజావు చేసుకుంటాడు.

గిరీశం, రాజా, కోటీశ్వర రావుల మీదే ఎక్కువగా సినిమా నడుస్తుంది. గిరీశం సూత్రధారిగా వ్యవహరిస్తాడు. ఆ సూత్రాల దారిని అనుసరిస్తుంటాడు రాజా! కోటీశ్వర రావు ధనార్జనకు దారులు వెతుకు తుంటాడు, తన దారిలో లేని వారిని చిన్న చూపు చూస్తుంటాడు. కించ పరుస్తుంటాడు. ఈ ధోరణితో పెళ్లిళ్ల పేరయ్యగా పేరు గాంచిన గిరీశాన్ని విమర్శిస్తాడు. తనను తన వృత్తిని అవమానించి నట్టుగా గిరీశం బాధ పడతాడు. కోటీశ్వర రావు డబ్బు మదాన్ని అణచాలనుకుంటాడు. తగిన శాస్తి చెయ్యదలుస్తాడు. అప్పటి నుంచి సూత్రధారిగా మారి నాటక మాడుతాడు. బస్టాండు కూలీగా పని చేస్తున్న రాజానే అమెరికాలో వున్న కోటీశ్వరుడి కొడుగ్గా నమ్మించి నాటకం నడిపిస్తాడు. డబ్బు పిచ్చిగల కోటీశ్వర రావు తన పెద్ద కూతురు రాణిని, రాజాకిచ్చి వివాహం జరిపిస్తాడు.

అంతటితో ఆగక గిరీశం మరో నాటకం ప్రారంభిస్తాడు. రాజానే కోటీశ్వర రావుకు మళ్ళీ చూపించి అతను రాజా తమ్ముడని చెప్తాడు. అతన్ని చిన్న అల్లుడుగా చేసుకుంటే అమెరికాలో వున్న కోటీశ్వరుడైన అతని తండ్రి మొత్తం ఆస్తి హస్తగతం చేసుకోవచ్చని కోటీశ్వర రావును ఊరిస్తాడు. తన రెండవ కూతురు సీతను అతనికిచ్చి పెళ్లి చేసేందుకు సిద్ధమవుతాడు కోటీశ్వర రావు. రాజా తన తమ్ముడిలా నటిస్తూ సీతతో కులుకుతూ కొన్ని వేళల్లో లాకి

కొరవ 11 పేజీలో

# నెల్లూరు మునిసిపాలిటీ - నెల్లూరు

## నోటిఫికేషన్

ఆ2/15982/85. తేది:20.11.93

1965 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ పురపాలక సంఘ చట్టములోని సెక్షన్ 83 ననుసరించి ఇందు మూలముగా యావన్మందికీ తెలియజేయునది యేమనగా నెల్లూరు పురపాలక సంఘములో అడ్వర్‌టైజుమెంటు టాక్సు రేట్లను 10.5.93 తేది గల జి.ఓ.యం.యస్. నెం. 320 యం.ఎ., గల ప్రభుత్వ ఉత్తర్వులలో ఆమోదించిన ప్రకటన రేట్లను 1.4.1994 తేది నుండి అమలు చేయబడుచున్నవి.

అందుచే ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ చట్టములోని 83 వ సెక్షన్‌ను అనుసరించి 30.6.93 తేది గల 198 నెంబరు మరియు 30.9.93 తేది గల 471 నెంబరు తీర్మానములలో నెల్లూరు పట్టణము పరిధిలో అడ్వర్‌టైజ్‌మెంటు టాక్సును సదరు చట్టములోని సెక్షను 81, 85 మరియు 114 మేరకు ఇందులో జతపరచిన రేట్లను మాత్రమే 1.4.1994తేది నుండి వసూలు చేయుటకు ఈ పురపాలక సంఘము వారు పుద్దేశించినారు.

సదరు ప్రకటన తేది లగాయితూ నెల రోజుల లోపల పై విధముగా విధింప బోవు పన్నులపై ఆక్షేపణలు గాని మరియు సలహాలు గాని మునిసిపల్ కౌన్సిలు వారి పరిశీలన కొరకు మునిసిపల్ కమీషనరు గారికి లిఖిత పూర్వకముగా దాఖలు చేసుకొన వచ్చునని ప్రకటించడమైనది.

### షెడ్యూలు

| వ.నెం. | వివరములు | 1.4.1994 తేది నుండి క్రొత్తగా విధించి వసూలు చేయబడు పన్ను సం.నకు రూ. |
|---|---|---|
| 1. | బిల్డింగు గోడలు, బోర్డింగులు, ఫ్రేము బోర్డులు స్క్రీన్లు మున్నగు వాటి పై విద్యుత్ ప్రకాశము లేని అడ్వర్‌టైజ్‌మెంటు | |
| ఎ) | ఒక చదరపు మీటరు వరకు గల స్థలమునకు | 36.00 |
| బి) | ఒక చదరపు మీటరు నుండి 2.5 చదరపు మీటర్ల వరకు గల స్థలమునకు | 54.00 |
| సి) | అధనముగా ఉండే ప్రద్యు 2.5 చదరపు మీటర్ల స్థలమునకు అందలి భాగమునకు | 54.00 |
| 2. | ఎద్దులు, గుర్రాలు లేక ఇతర జంతువులు లాగే బండ్లు, మనుషులు లాగే బండ్లు, లేదా సైకిలు లేదా ఇతర వాహనములు లేక ట్రాము కారుల పై వేసే విద్యుత్ ప్రకాశము లేని అడ్వర్‌టైజ్‌మెంట్లు | |
| ఎ) | 5.00 చ.మీటర్ల వరకు గల స్థలమునకు | 200.00 |
| బి) | అదనముగా ఉండే ప్రతి 3.00 చ.మీ. స్థలానికి లేదా అంతకంటె తక్కువ దానికి | 200.00 |
| 3. | వాహనములపై విద్యుత్ ప్రకాశముతో వుండే అడ్వర్‌టైజ్‌మెంటు బోర్డులు | |
| ఎ) | 5.00 చదరపు మీటర్ల వరకు గల స్థలానికి | 460.00 |
| బి) | అదనముగా ఉండే ప్రతి 5.00 చ.మీ. స్థలానికి లేదా అంత తక్కువ దానికి | 460.00 |
| 4. | మనుషులచే మోయబడి విద్యుత్ ప్రకాశము లేని అడ్వర్‌టైజ్‌మెంటు బోర్డులు. | |
| ఎ) | విస్తీర్ణములో 1 చ.మీ. మించని అడ్వర్‌టైజ్‌మెంటు ప్రతి బోర్డుకు | 54.00 |
| బి) | విస్తీర్ణములో 1 చ.మీ. నుండి 2.5 చ.మీ. వరకు గల ప్రతి బోర్డుకు | 90.00 |
| సి) | అదనముగా ఉండే ప్రతి ఒక చదరపు మీటరు లేక అందలి భాగమునకు గల ప్రతి బోర్డుకు | 36.00 |
| 5. | మనుషులచే మోయబడు విద్యుత్ ప్రకాశము గల అడ్వర్‌టైజ్‌మెంట్ బోర్డుకు. | |
| ఎ) | ఒక చదరపు మీటరు మించని ప్రతి బోర్డుకు | 92.00 |
| బి) | ఒక చదరపు మీటరు మించిన మరియు 2 చ.మీ. వరకు గల ప్రతి బోర్డుకు | 180.00 |
| సి) | అదనముగా ఉండే ప్రతి ఒక చదరపు మీటరు ప్రాంతానికి లేదా అందలి భాగమునకు | 92.00 |
| 6. | నేల, బిల్డింగు, గోడ, హోర్డింగు, ఫ్రేము పోస్టు స్క్రీన్లు మున్నగు వాటి పై విద్యుత్ ప్రకాశముతో చేయు అడ్వర్‌టైజ్‌మెంటులకు | |
| ఎ) | 0.20 చదరపు మీటర్ల స్థలానికి | 36.00 |
| బి) | 0.20 చ.మీ. నుండి 0.50 చ.మీ. వరకు గల స్థలానికి | 90.00 |
| సి) | 0.50 చ.మీ. నుండి 2.50 చ.మీ. వరకు గల స్థలానికి | 120.00 |
| డి) | అదనముగా ఉండే ప్రతి 2.5 చ.మీ. లేక అందలి భాగమునకు | 120.00 |
| 7. | లాంతరు సైడులు లేదా అదే విధమైన పద్ధతిలో బహిరంగ ప్రదేశములో తెరలపై ప్రదర్శించు అడ్వర్‌టైజ్‌మెంటు | |
| ఎ) | 0.50 చ.మీ. వరకు గల స్థలానికి | 180.00 |
| బి) | 0.50 చ.మీ. నుండి 2.50 చ.మీ. వరకు గల స్థలానికి | 240.00 |
| సి) | అదనముగా ఉండే ప్రతి క 2.00 చ.మీ. లేదా అందులో భాగమునకు | 240.00 |
| ఎ) | స్లైడులు (సాదా లేక రంగువి) ఒక్కొక్క దానికి | 108.00 |
| 2. | షార్టులు (ట్రైలర్ ఫిల్ముతో సహా) 150 మీ. నిడివి | 288.00 |
| 3. | షార్టులు 150 మీ నుండి 300 మీ. వరకు | 576.00 |
| 4. | షార్టులు 300 మీ మించిన ప్రతి అదనపు 150 మీ. లేక అందలి భాగమునకు | 576.00 |
| 8. | వీధులకు అడ్డముగా వ్రేలాడదీసే విద్యుత్ ప్రకాశము లేని అడ్వర్‌టైజ్‌మెంట్లు | |
| ఎ) | చదరపు మీటరు వరకు గల స్థలానికి | 36.00 |
| బి) | చదరపు మీటరు నుండి 2.5 చ.మీ. వరకు గల స్థలానికి | 54.00 |
| సి) | అదనముగా ఉండే ప్రతి 2.5 చ.మీ.లకు అందలి భాగమునకు | 54.00 |

సూచన:8వ అయిటములో సూచించిన ప్రకటన పన్ను సదరు ప్రకటనచేయు స్థలమునకు కమీషనరు గారిచే నిర్ణయించ బడిన పన్నుకు అదనము.

| వ.నెం. | వివరములు | రూ. |
|---|---|---|
| 9. | హోర్డింగు ఖాళీగ ఉండి అడ్వర్‌టైజ్‌మెంటు పేరు లేదా అద్దెకు అన్న ప్రకటనతో వ్రేలాడదీసిన విద్యుత్ ప్రకాశములేని అడ్వర్‌టైజ్‌మెంటు | |
| ఎ) | చదరపు మీటరు వరకు గల స్థలానికి | 18.00 |
| బి) | 1 చ.మీ. నుండి 2.5 చ.మీ. వరకు గల స్థలానికి | 30.00 |
| సి) | అదనముగా ఉండే ప్రతి 2.5 చ.మీ. గల స్థలానికి లేదా అంతకంటె తక్కువ | 30.00 |

10. ప్రతి ఆక్షన్ విక్రయానికి సహేతుకమైన సైజులలో అడ్వర్‌టైజ్‌మెంట్లు గల రెండు బోర్డులను ఆక్షన్ జరిగే ఆవరణలో కాకుండ స్థానికముగా ప్రధానమైన స్థలములో ఒక బోర్డు మరియు రెండవ దానిని (మునిసిపల్ లాంతరు స్థంభానికి అమర్చడానికి ఆక్షనర్లకు పరి న్ మునిసిపల్ లాంతర్ స్థంబములపై బోర్డును ప్రదర్శించడానికి అద్దెకు కలిపి) ప్రతి వేలం దారుడు వేలమునకు సంబంధించిన స్థలములో వేలం యొక్క వివరములు తెలుపు సాహేతుకమైన కొలతలు గల బోర్డులను రెండు మించి పెట్టరాదు మరియు సదరు బోర్డు ఒక దానిని ఆ ప్రదేశములోని ప్రాముఖ్యము గల స్థలములోను రెండవది పురపాలక వీధి స్థంబమునకు వుంచవచ్చును. వీధి స్థంబము పై ఉంచు బోర్డుకు వేరే అదనపు ఫీజు చెల్లించనవసరము లేదు.

11. ప్రదర్శనము వగైరాల నిమిత్తము అచ్చు వేయబడిన ప్రకటనలకు.

| | | |
|---|---|---|
| ఎ) | 60.96 సెం.మీ. 91.44 సెం.మీ. మొదటి వందకు | 144.00 |
| | తరువాత వందకు | 72.00 |
| | ప్రతి అదనపు వందకు | 54.00 |

బి) పెద్ద సైజు అడ్వర్‌టైజ్‌మెంట్‌కు అందుకు తగిన విధముగా హెచ్చింప బడిన రేట్లు వసూలు చేయడం జరుగుతుంది.

షరా: నిబంధనములోని 7వ నిబంధన ననుసరించి పై సంవత్సరము రేట్లతో నెలవారిగా 1 1/2 రేటు కూడ వసూలు చేయుటకు నిర్ణయించడమైనది.

**డి.వి. రెడ్డి**
కమీషనరు

## జనవాణి

(3 పేజీ తరువ)

చేతులు మారుతున్నందు వల్ల 100 రూపాయల వస్తువుకు 8 రూపాయలు ట్యాక్సు చెల్లించ వలసి వస్తున్నది. ఈ భారమంతా వినియోగ దారుని మీదె పడుతుంది. ఈ విధంగా కాకుండా టర్నోవర్ ట్యాక్సుని సింగిల్ పాయింటుగా మార్చి, మొదటి అమ్మకం దారుని వద్దే వసూలు చేస్తె బాగుంటుంది.

-చొమ్మన సుబ్రహ్మణ్యం
నెల్లూరు

### లైంగిక విజ్ఞానం అవసరమే!

ప్రముఖ లైంగిక వైద్యులు శ్రీ రాజగోపాల్ రెడ్డి ఇచ్చే సలహాలు జమీన్‌రైతులో ప్రచురించడం సబబుగా వుంది. పురాతన కాలం నాడే వాత్సాయనుడు కామసూత్రాలు రాసిన ఈ భూమిలో ఎందువల్లో లైంగిక విజ్ఞానాన్ని తెలుసుకోవడాన్ని తప్పుగా భావిస్తున్నారు. భావాలను వ్యక్తం చేయను సంశయిస్తున్నారు. దీనివల్లే పలు వుపద్రవాలు సంభవించి సాంసారిక జీవితాలు వారు నాశనం చేసుకొన్న వారు కోకొల్లలు. ఇటువంటి ఇంకా జరుగకుండా లైంగిక విజ్ఞానానికి విస్తృత ప్రచారం ఇవ్వాలి.

నెల్లూరు -రావూరి సురేంద్రనాథ్

### యానాదిరెడ్డి రూటేవేరు- విమర్శలు వద్దు!

నెల్లూరు జిల్లా రాజకీయ రంగంలో శ్రీ కలికి యానాది రెడ్డి సర్వ స్వతంత్రుడు, స్వేచ్ఛాజీవి. అందరి మధ్య తన వునికిని పరి రక్షించుకునే ప్రయత్నాలలో ఆయన మార్గం, ఫక్కీయే వేరు. ఒకప్పుడు శ్రీనివాసులు రెడ్డి ఇప్పుడు యానాది రెడ్డి రాజకీయ జీవితాలను మన పత్రికలో శల్య పరీక్ష చేస్తున్నారు. ఇక నుండి ఆయనలో తప్పొప్పులు చూపి సరియైన పంథాలో నడిచేందుకు మాత్రమే విమర్శలు చేయమని మనవి.

జలదంకి -నిమ్మలపల్లి శ్రీనివాసులు

### వ్యక్తుల మార్పు వల్ల పార్టీ పునరుజ్జీవనం కాదు

వ్యక్తిగత ఇమేజ్ లేదని రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా వున్న శ్రీ మర్రి తులసిదాసును మార్చి సినిమా పరిశ్రమకు చెందిన శ్రీ దాసరి నారాయణ రావును ఆ స్థానంలో నియమించ నున్నారని ఇటీవల ఒక పత్రికలో చదివి ఆశ్చర్య పోయాను. వ్యక్తుల ఇమేజ్ కన్నా కాంగ్రెస్ పార్టీ ఇమేజ్ ఎక్కువ. కాంగ్రెస్ పార్టీ కన్నా మెరుగైన ప్రత్యామ్నాయం దేశంలో ఇంకొకటి లేదు. ఇప్పటి నాయకులు అలనాటి స్వాతంత్రోద్యమ స్ఫూర్తిని యువతలో రగిల్చి, మతతత్వ, విచ్ఛిన్నకర ప్రాంతీయ ధోరణుల పై పోరాటానికి సిద్ధం చేసే విధానాలను పార్టీలో పెంపొందించాలి. అవి మాని పిసిసి అధ్యక్షులను, ముఖ్యమంత్రులను తరచూ మారిస్తే పార్టీ బలపడదు - బలహీన పడుతుంది.

కావలి -వి.వి. నరసింహా చార్యులు



ఇటీవల వైజాగ్‌లో జరిగిన షష్ఠ్యబ్ది అభినందన సభలో తన సహధర్మచారిణితో గూడూరు వాసి చిత్రకవి ఆత్రేయ

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

వేయించిన ఘుమఘుమ లాడే జీడి మామిడి పప్పులు తిన్పించారు.

### స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా పబ్లిక్ ఇష్యూ

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా పబ్లిక్ ఇష్యూ విడుదల చేస్తున్న సందర్భాన్ని పురస్కరించుకొని 30 తేది ఐ.ఎమ్.ఎ. మీటింగ్ హాల్‌లో ఆ బ్యాంక్ వినియోగ దార్ల సమావేశం ఏర్పాటు చేసింది. డిశంబర్ 15 తేది నుండి 24 తేది వరకు నెల్లూరు, గూడూరు బ్రాంచీలలో అప్లికేషన్లు స్వీకరిస్తారని ఆ బ్యాంక్ హైదరాబాద్ ఆపరేషన్ జనరల్ మేనేజర్ శ్రీ ఎన్. సవైకర్ చెప్పారు. 12 కోట్ల 40 లక్షల ఈక్విటీ షేర్లు విడుదల చేస్తున్నట్లు షేర్ విలువ 10 రూపాయలకు ఈ ప్రీమియం విలువ 90 తో కలిపి 100 రూపాయలుగా నిర్ణయించినట్లు వివరించారు. వెయ్యి రూపాయలు విలువ చేసే 50 లక్షల బాండ్లు కూడా విడుదల చేస్తున్నట్లు చెప్పారాయన. 1955 లో ఏర్పడిన ఈ బ్యాంక్ దేశ వ్యాప్తంగా 8725 శాఖలతో వర్ధిల్లు తుందని 47 విదేశాల్లో కూడా శాఖలు కల్గివుందన్నారు. జిల్లాలోని స్టేట్ బ్యాంకులు 106 కోట్ల రూపాయలు డిపాజిట్లుగా సేకరించి 103 కోట్లు అడ్వాన్సుగా ఇచ్చినట్లు బ్యాంక్ తిరుపతి జోనల్ అసిస్టెంట్ జనరల్ మేనేజర్ శ్రీ రాధాకృష్ణయ్య చెప్పారు. పబ్లిక్ ఇష్యూ మీద ఖాతాదార్ల సందేహాలను బ్యాంక్ తిరుపతి పర్సనల్ సర్వీస్ ఛీఫ్ మేనేజర్ శ్రీ ఎ. భాను తీర్చారు. జిల్లాలోని అన్ని స్టేట్ బ్యాంక్ శాఖల మేనేజర్లు ఈ కార్యక్రమంలో పాల్గొని జనరల్ మేనేజర్‌ను గులాబి మాలలతో ముంచెత్తారు.

### అర్బన్ బ్యాంకు ఎన్నికలు

సి.పి.ఐ. గుత్తాధిపత్యంలో కొనసాగుతున్న నెల్లూరు కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ ఎన్నికల్లో ఈసారి కూడా ఆ పార్టీ తన పట్టు నిలబెట్టుకొంది. పార్టీకి చెందిన జె.సి.ఎస్. అమర్‌నాథ్, అరిగెల నాగేంద్ర సాయి, ఎం. రామచంద్రయ్య, ఎ. శ్రీనివాస రావు, కె. శ్రీనివాస మూర్తి, షేక్ అహమద్ భాషా, ఎస్. జగదీష్, వి. పురుషోత్తం, ముక్కంటి రాజా, ఎ. ఈశ్వరయ్య, వి. శాంతమ్మ, ఎ. రమణయ్య కార్యవర్గ సభ్యులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. పాత పాలక వర్గ అధ్యక్షులు జర్నలిస్ట్ కె.వి. రమణయ్య ఎందువల్లో ఈసారి పోటీ చేయలేదు. పాలక వర్గ అధ్యక్ష, ఉపాధ్యక్షులను 7 తేది ఎన్నుకొంటారని రిటర్నింగ్ అధికారి జె. చంద్రశేఖర రావు చెప్పారు.

### క్రికెట్ విజేత వి.ఆర్.సి.

పదేళ్ల సుదీర్ఘ విరామం తరువాత వి.ఆర్. కాలేజి క్రికెట్ టీమ్ తిరుపతిలో జరిగిన అంతర్ కళాశాలల పోటీల్లో చిత్తూరు ప్రభుత్వ కళాశాల జట్టు పై 8 వికెట్ల భారీ ఆధిక్యంతో విజయం సాధించి యూనివర్శిటీ కప్పును సాధించు కొచ్చింది. ఈ పోటీల్లో తొలుత బ్యాటింగ్ చేసిన చిత్తూరు జట్టు 56 పరుగులకే కుప్పకూలి పోగా ఆ సునాయాస లక్ష్యం సాధించను నెల్లూరు జట్టు రెండు వికెట్లు మాత్రమే పోగొట్టుకొంది. ప్రధాన బ్యాట్స్‌మెన్, కె. మనోజ్ కుమార్ 4 ఫోర్లతో 30 పరుగులు చేసి జట్టు విజయానికి కారణ భూతుడయ్యాడు. జట్టులోని జి. రజనీష్ 4 వికెట్లు, కె. కనక రాజా 3 వికెట్లు తీసుకొన్నారు. ఈ విజయాన్ని పురస్కరించుకొని 27 తేది జట్టు సభ్యులను కళాశాల కరస్పాండెంట్ ఆనం వివేకానంద రెడ్డి సన్మానించారు. టైటిల్ సాధించుకొచ్చిన జట్టుకు 450 రూపాయలు విలువ చేసే ట్రాక్ సూట్, క్యాప్‌ను కానుకగా ఇస్తానని ఆయన వాగ్దానం చేసారు. కార్యక్రమంలో ప్రిన్సిపల్ గోపాలకృష్ణ, కళాశాల ఫిజికల్ డైరక్టర్ జి. దయాకర రెడ్డి, జిల్లా క్రికెట్ అసోసియేషన్ మాజీ కార్యదర్శి ప్రభాకర రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### 5 తేది అవోపా మహిళా దినోత్సవం

అవోపా మహిళా విభాగ్ దినోత్సవం 5 తేది స్టోన్‌హౌస్ పేటలోని టి.వి.ఎస్. బాలికల పాఠశాలలో జరుగుతుంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని మహిళలకు రాష్ట్ర స్థాయిలో వివిధ పోటీలు నిర్వహిస్తారు. సాయంత్రం జరిగే సభలో విజేతలకు బహుమతు లందజేస్తారని అధ్యక్ష కార్యదర్శులు పి. పద్మావతి, వై.ఎం. ధనలక్ష్మి తెలిపారు.

### 30 లక్షలతో దోబీఘాట్లు

ఆంధ్ర ప్రదేశ్ వాషర్ మెన్ కో ఆపరేటివ్ ఫెడరేషన్ లిమిటెడ్ ఛైర్మన్ డాక్టర్ ఎం. అంజయ్య 26, 27 తేదీల్లో జిల్లాలో పర్యటించి రజకుల అభివృద్ధికి చేపడుతున్న కార్యక్రమాలను పరిశీలించారు. జిల్లాలో 108 దోబీఘాట్లు నిర్మించేందుకు 30 లక్షల రూపాయలు మంజూరయ్యాయని, వాటితో 19 దోబీఘాట్లు నిర్మించినట్లు కలెక్టరేట్‌లోని సైక్లోన్ మీటింగ్ హాల్‌లో జరిగిన సమావేశంలో విలేఖరులకు చెప్పారు. వీటి నిర్మాణానికి కాంట్రాక్టర్లతో పని లేకుండా స్థానిక సహకార సంఘాలకే అధికార మిచ్చారని; రాష్ట్రంలో ఇప్పటికే వున్న 1003 రజక సహకార సంఘాలకు బ్యాంకులతో నిమిత్తం లేకుండా వాషర్‌మెన్ ఫెడరేషన్ ద్వారా నేరుగా లోన్లు మంజూరు చేస్తున్నట్లు వివరించారు. కలెక్టర్ ఎం. సాంబశివ రావు మాట్లాడుతూ బి.సి. కార్పొరేషన్ ద్వారా ఒక్కొక్క దోబీఘాట్ నిర్మాణానికి 50 వేల రూపాయలను గ్రామ పంచాయితీ లేదా శాసన సభ్యుని నియోజక వర్గ అభివృద్ధి నిధుల నుండి 25 వేలు కేటాయించినట్లు, డి.ఆర్.డి.ఏ. ద్వారా 9 లక్షల వ్యయం కాగల 14 యూనిట్లు మంజూరు చేసినట్లు చెప్పారు. టౌన్‌లో దోబీఘాట్లు నిర్మించే చోట రజకుల గృహ నిర్మాణం చేపట్టాల్సిందిగా కలెక్టర్ మునిసిపల్ కమీషనర్‌ను కోరారు.

### పాఠశాలల్లో కనీస వసతులు కల్పించండి

పాఠశాలల్లో కనీస వసతులు కల్పించడంతో పాటు ఖాళీగా వున్న ఉపాధ్యాయ పోస్టులను భర్తీ చేయాలని 27 తేది టౌన్‌హాల్లో భారత ప్రజాతంత్ర యువజన సమాఖ్య ఆధ్వర్యంలో జరిగిన సదస్సు డిమాండ్ చేసింది. సదస్సును ప్రారంభించిన జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర ఉపాధ్యక్షుడు డాక్టర్ విజయ కుమార్ మాట్లాడుతూ రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న పాఠశాలల్లో కనీస వసతులు లేవు. 49 వేల పాఠశాలల్లో 27 వేల టీచర్ పోస్టులు ఖాళీగా వున్నాయి; అందువల్లే ఉత్తీర్ణతా శాతం పడిపోయిందని విమర్శించారు. పాఠశాలల్లో కనీస వసతుల కోసం గ్రామస్తులు కూడా సహకరించాలన్నారు. యు.టి.ఎఫ్. నాయకుడు బాలసుబ్రహ్మణ్యం; జిల్లా డివైఎఫ్ఐ అధ్యక్ష కార్యదర్శులు సమావేశంలో ప్రసంగించారు. సదస్సుకు భారీ సంఖ్యలో విద్యార్థులు హాజరయ్యారు.

### తపాల ఉద్యోగుల సమ్మె

తమ న్యాయ మైన కోర్కెలు తీర్చడంలో ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరికి నిరసనగా డిశంబర్ 7 తేది నుండి దేశ వ్యాప్త సమ్మెకు సిద్ధం కావాలని తపాలా వుద్యోగుల సంయుక్త కార్యాచరణ కమిటీ పిలుపు నిచ్చింది. వుద్యోగులను సమ్మెకు ఆయత్తం చేసేందుకు పెద్ద పోస్టాఫీసులో సంఘ నాయకులు 29 తేదిన సభ నిర్వహించారు. ఇ.డి.వుద్యోగులకు స్కేల్‌తో కూడిన వేతనాలు ఇవ్వాలని, పెన్షన్ చెల్లింపుకు ఇ.డి. సర్వీసును పరిగణనలోనికి తీసుకోవాలని, ఓ.సి.ఆర్. పోస్టులలో 10 శాత గ్రేడ్ 1 గా గుర్తించాలని, జీతం 1800 రూపాయలకు పెంచాలని డిమాండ్ చేశారు. పోస్టల్, ఆర్.ఎం.ఎస్. పనులు ఇతరులకు అప్పగించ రాదని, సెలవుల్లో, ఇతర సమయాల్లో పనిచేసే వారికి గంటల దామాషా పై ఓవర్ టైం అలవెన్సు ఇవ్వాలన్న విషయాలు కూడా డిమాండులలో వున్నాయి. ఈ సభలో తపాల వుద్యోగుల సంఘం నాయకులు నాగభూషణం, హుమయూన్, ప్రభుదాస్, దేవదానం, మునిరత్నం, సత్య నారాయణ, వేణుగోపాల్, శరత్‌బాబు తదితరులు పాల్గొన్నారు.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

తాకినట్లు నటిస్తాడు. ఇంతలో ఒక నిజమైన కోటీశ్వరుడి కొడుకు శ్రీకాంత్ సీత మీద కన్ను వేస్తాడు. తర్వాత వెయ్యి వేస్తాడు. ఆ తర్వాత చెయ్యవలసింది చేసేస్తాడు. తన రెండవ కూతురు మానభంగానికి గురి కావటంతో గుండె దెబ్బ తిన్నట్టు కూలిపోతాడు కోటీశ్వర రావు. తంతే బూరెల మూకుడులో పడ్డట్టు కోటీశ్వర రావుకు కోటీశ్వరుడి కొడుకైన శ్రీకాంత్‌ను తన చిన్న అల్లుడిగా చేసుకునే భాగ్యం కలుగుతుంది.

చిత్రం మొత్తం వినోదమే ప్రధానంగా సాగుతుంది. గిరీశం, కోటీశ్వర రావుకు శాస్త్రి చెప్పేందుకు ఆడిన నాటకంలో ప్రతి అంశమూ వినోదానికి సహకరిస్తుంది. ఈ అంశాలతో సహకరించి సత్యానంద్ వ్రాసిన మాటలు వినోదాన్ని మరింత పెంచాయి.

ఈ సినిమా వినోదాన్ని అందించటమే గాక ఒక చక్కటి సందేశాన్ని గూడా పొందు పరిచింది. అది వృత్తి పరమైన సందేశం. ఎవరి వృత్తి వారిది. తన వృత్తిలో నీతిగా నాలుగు డబ్బులే సంపాదించు కున్నా అందులో ఆనందం వుంది. అవినీతితో లక్షలు ఆర్జించే ఇతర వృత్తుల్లో వారు నీతిగా బ్రతికే వారిని విమర్శించ కూడదు.

దాసరి నారాయణ రావు గిరీశం పాత్రలో హాస్యరసం క్రుమ్మరించారు. ప్రేక్షకుల దృష్టిని బాగా ఆకర్షించాడు. కోటీశ్వర రావుగా కోట శ్రీనివాస రావు నటనలో ప్రత్యేకత చూపాడు. రాణిగా ఆమని, సీతగా రంభ ఆకర్షణీయంగా కనిపించారు. ఎన్. సుధాకర్ రెడ్డి ఫోటోగ్రఫీ ప్రతి దృశ్యాన్నీ అందంగా రూపొందించింది. వేటూరి పాటలు రాజ్-కోటి సంగీతంలో కమ్మదనాన్ని సంతరించు కున్నాయి.

సుమన్ చేసిన రెండు ఫైటింగులు, రంభ రెండు డాన్సులు తప్ప సినిమా అంతా ఎలాంటి అసభ్యత జోలికి పోకుండా ఒక కుటుంబ కాలక్షేపంగా సాగిపోయి వినోద విహారంగా మారి పోయింది.

## సినిమా

(9 పేజీ కొరవ)

కొత్త చిత్రం పేరు. కృష్ణ అభిమానులంతా ఈ టైటిల్‌ని ఎంతో మెచ్చుకున్నారట. కృష్ణ సరసన హిందీ తార షైరాబాను తమ్ముడి కూతురు షహీన్‌తో పాటు రంభ మరో నాయిక. ఇంకా గుమ్మడి, సత్యనారాయణ, గిరిబాబు, కోట శ్రీనివాస రావు, చరణ్‌రాజ్, సాయికుమార్, ప్రహర్షి రాఘవ, ఆలీ, సిల్క్‌స్మిత ఇతర పాత్రధారులు. రచన: పరుచూరి సోదరులు. సంగీతం: కీరవాణి. ఛాయ: వి.ఎస్.ఆర్. స్వామి. ఆఖరికి అభిమానులు కూడా టైటిల్స్‌ని ఆమోదించే పరిస్థితికి వచ్చింది తెలుగు సినిమా రంగం ! దమ్ముల్లేక ఆ చిత్రం నీరసంగా ఆడితే, దాన్ని బలవంతం మీద వందరోజులు నడిపించాలని థియేటర్ వారి మీద వత్తిడి తెచ్చి నానా అల్లరి చేసేదీ ఈ అభిమానులే.

### పారితోషికం పెంచనున్న నరేష్

"ఇది వరకు మొహమాటానికి లొంగి, కథ తెలుసుకోకుండా ప్రతి దర్శక నిర్మాత అడిగిన పిక్చర్లంతా అంగీకరించే వాడ్ని. అవన్నీ ఎంతో ఆశాభంగాన్ని కల్గించాయి. ఇంచేత, మంచి కథ, సమర్థుడైన దర్శకుడు ఉంటేనే ఒప్పుకో దలిచాను. అందుకు నాకు తోచిన మార్గం రేటు పెంచేయడం. ఇందువల్ల నా పై అనవసరపు ఒత్తిడి తగ్గుతుంది. మంచి చిత్రాలు ఎంపిక చేసి నేను అంగీకరిస్తాను" అన్నాడు నరేష్.

## ఎన్టీఆర్

(మొదటి పేజీ కొరవ)

కుంటోంది. ముఖ్యమంత్రి కొడుకు రాజ్యాంగేతర శక్తిగా వ్యవహరిస్తున్నాడని, జిల్లాలో పెత్తనం చేస్తున్నాడని ఆరోపణలు ఆకాశాన్నంటుతున్న తరుణంలో తెలుగుదేశం సదస్సు విజయవంతం కావటంతో కోట్ల వ్యతిరేకుల ఉత్సాహానికి అంతు లేకుండా ఉంది. ముఖ్యమంత్రి, ఆయన కుమారుడి పై వ్యతిరేకతతోనే కర్నూలు సదస్సుకు లక్షలాది జనం హాజరయ్యారని కోట్ల వ్యతిరేక వర్గాలు ఇప్పుడు ప్రచారం మొదలెట్టాయి.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products India Ltd.